Nihil obstat,

**Rev. B. Mariadas.**

Imprimatur.

**✠ M. Ignatius,**

**Bishop of Guntur.**

1-1-'58

# మున్నుడి

జాన్ బనియన్ అనునాతడు ఆంగ్లభాషలో "పిల్ గ్రిమ్స్ ప్రోగ్రెస్" అను పుస్తకమును వ్రాసెను. ఈ గ్రంథము పెక్కు భాషలలోనికి అనువదింపబడి, నేటికిని బహుళ ప్రచారములో నున్నది. పై గ్రంథమునే సంగ్రహపరచి, అచట నచట కొన్ని మార్పులను గావించి, 'యాత్రికాభ్యుదయము'ను నీ చిన్ని పొత్తమును రచించితిని. గుణగ్రహణ పారీణులగు పెద్దలు ఇందలి దోషములను మన్నింతురుగాక !

**పూదోట జోజయ్య బి. ఏ. (ఆనర్సు)**

కనపర్తి, గుంటూరు జిల్లా.

## ఈ క్రింది శబ్దములకు మూలగ్రంథములోని ఆంగ్ల నామములు



యాత్రికాభ్యుదయము=The pilgrim's progress
వినాశక పట్టణము=The city of destruction
సువిశేషకారుడు=Evangelist
సూక్ష్మద్వారము=Wicket-gate
సుబుద్ధి=Good-will
వ్యాఖ్యానకుడు=Interpretor
జాగరూకుడు=Watchful
శ్లాఘుడు=Apollyon
విశ్వాసుడు=Faithful
డాంబికద్వయము=Vanity pair
మృత్యుచ్ఛాయ=The shadow of death
శోకోత్కటుడు=Giant Despair
ఆశావాది=Hopeful
సహాధ్యాయులు=Class-mates
పాషండుడు=Heretic
మాంత్రికుల దుష్టభూములు=Enchanted-grounds
దయావతి=Mercy
బృహత్పరాక్రముడు=Great-heart
వివేకవతి=Prudence
సత్యకాముడు=Honest
సౌజన్యమూర్తి=Gaius
గోలాంగూలము=A kind of monkey



# యాత్రికాభ్యుదయము

## మొదటి భాగము

దుఃఖభాజనమును అంధకార బంధురము నగు నీ ప్రపంచమునుండి సాగిపోవుచు, ఒక్కెడ దీపము వెలిగించితిని. అచ్చట నొకగుహ గాన్పింపగా అండే నిద్రించితిని. ఆ నిద్రలో స్వప్నమున చింపిరి గుడ్డలతో దీనవదనుడై యున్న మనుష్యు నొక్కని జూచితిని. అతని చేత నొక పుస్తకమున్నది. వీపుపైన పెద్ద భారమున్నది. అత డా పుస్తకమును తెరచి చదువుచు, దుఃఖించుచు, గడగడ వణకుచు, నే నేమి చేయుదునని బిగ్గరగా వాపోవ జొచ్చెను. గృహములో నడుగిడి, కొంత సేపతడు శాంతచిత్తుడై యుండెను. కాని పొంగి పొరలి వచ్చు దుఃఖమును ఆపజాలక, భార్యా బిడ్డలతో "కంటిరి గదా! నా వీపుపైనున్న ఈ భారమును భరింపజాలక నన్ను నేనే నాశనమొనర్చు కొనుచున్నాను. మనము కాపురమున్న ఈ నగరము అనతికాలములో దారుణాగ్నిచే భస్మీపటలము గానున్నదని వింటిని. శీఘ్రముగా ఈ పట్టణమును విడుచు మార్గమును వెదకమేని, కుటుంబ సహితముగా ఆ యగ్ని కాహుతిరమై పోవంగల వారము" అనెను.

అతని వాక్యములకు బంధు జనులెల్లరు ఆశ్చర్యపడిరి. పిచ్చివాడై నోటికివచ్చినట్లు ప్రేలెగాక, మనమెట్లు విశ్వసింతమని తలచి, వానికాకొంత విశ్రాంతి యవసరమని, బలవంతముగా నాతని నిద్రపుచ్చిరి. కాని యారాత్రి మిక్కిలి భయానకమైయుండ, నిద్రించుటకు మారుగా నతడు నిట్టూ

ర్పులతోడను, దీర్ఘ నిశ్వాసములతోడను గడిపివైచెను. మరు నాడుఉదయముగూడ, బంధువులాతనిని పూర్వావస్థయందే బాధపడుచుండుట గమనించి, కొందరు ఓదార్చిరి. కొందరు కుస్తరించిరి. కొందరు పిచ్చివానితో మనకేమి పని యని పూర్తిగా నుపేక్షించిరి. అప్పుడా మనుజుడు తన గదిలోనే జపించుచు, తనపొరుగు వారికి రానున్న దురావస్థనుగూర్చి పెద్దగా పరితపించెను. ఎందును కాలు నిలువకుండుటచే పంట పొలములకు పోయి పైరులమధ్య తిరుగుచు, పఠించుచు దినములు వెళ్ళబుచ్చువాడు. ఒంటరిగా తిరుగు నప్పుడుకూడ పూర్వమువలెనే, రక్షింపబడుటకు నే నేమి చేయుదునని బిగ్గరగా నరచు చుండును.

అప్పుడప్పుడు అట్లు పొలములలో తిరుగుచున్నప్పుడు అతని కేదోస్ఫురింపగా తటాలున పరుగెత్త బోయెను. నలు వైపులు పరికించి, మార్గమేమియు గనుపింప కుండుటచే గాబోలు ఆత్రుతతో నిలువబడిపోయెను. అప్పుడు దేవదూత యొకడు ప్రసన్న వదనముతో వానిని జేరవచ్చెను. సువిశేష కారుడనియు ఉపదేశకుడనియు ఆ దివ్య స్వరూపునకే నామాంతరములు. వచ్చి ఎందుకిట్లు విలపించుచుంటివని అతని నడిగెను. "అయ్యా! ఈ గ్రంథములో నాకు మృత్యువు ధృవమైనట్లును జదివితిని. చనిపోవుట నా కిష్టములేదు. తీర్పు లోనేను నిలువంజాలను. మరి విలపింపక ఏమి చేయుమందు వని యా మనుష్యు డనెను. జీవిత మింత చెడ్డదై యున్నపుడు నీవేల మృత్యువున కొడంబడవని దేవదూత యనెను. నా వీపాయు ఈ మహా భారము నన్నధః పాతాళమున కీడ్చు కొని పోవుచున్నది. ఖైదునకు పోవుటకే ధైర్యము చాలక

భయపడువాడు, తరువాత రానున్న న్యాయవాదుల తీర్పునకును, అటు తరువాత రానున్న మరణ దండనమునకును, నిలిచి యుండ గలడా? ఈ యభిప్రాయములన్నియు తలపునకు వచ్చుటచే తాళజాలక బిగ్గరగా విలపించుచుంటిన'ని ఆ మనుష్యుడనెను. పరిస్థితి యిట్లు విషమించుచున్నప్పుడు జాగేల చేయుచున్నావని దేవదూత యడుగ 'ఎటు బోవుటకును దోచుట లేద'ని యా మనుష్య డనెను. ఇచ్చటనుండి శీఘ్రమే పరుగెత్తిపొమ్మని వ్రాయంబడిన కాగితపు చుట్ట నొకదానిని సువిశేషకారుడు వాని కందించెను. ఎచ్చటికి బోవలయునని సంశయగ్రస్తుడై యాతడు ప్రశ్నించెను. దేవదూత చేయెత్తి చూపుచు 'అల్లదె దూరప్రాంతములో నొక సూక్ష్మ ద్వారమున్నది. కన్పించుచున్నదా?' యని యడుగ, నాతడు పరికించి, లేదనెను. మరల ప్రకాశవంతమైన కాంతిని చేయెత్తి చూపుచు 'ఆ వెలుగు కన్పించుచున్నదా?' యని యడుగ, ఆ మనుష్యుడు పరికించి కన్పించుచున్న దనెను. 'అట్లయిన మేలు. ఆ కాంతిని దృష్టిపథమున నుంచుకొని నడచిపొమ్ము. అచ్చట నొక ద్వారమును గాంచగలవు. ఆ తలుపుపై తట్టెదవేని, నీవేమి చేయవలసినదియు నచ్చట చెప్పబడును. ఇట్లని దేవదూత నిర్దేసింపగనే, ఆ మనుష్యుడు పరుగెత్తి పోసాగెను. అది చూచి విస్మయంపడి వాని భార్యా పుత్రులు మరలిరమ్మని కేకలిడిరి. అతడు వినిపించుకొనమికి రోధన మారంభించిరి. కాని వారి కేకలుగాని ఏడ్పులుగాని వినరానట్లు చెవులలో వ్రేళ్ళిడికొని అతడు మరింతదీక్షతో పరుగెత్తెను. ఆ పరుగులో "జీవితము! నిత్యజీవితము!" అనుచు వాపోవుటను వింటిని.

ఆ సమయములో ఇరుగుపొరుగు వారందరును వెలుపలకు వచ్చి ఆ తెరువరిని కొందరు 'ఎందుకంత త్వరగా పరుగెత్తెద'వని పరిహసించు వారును, కొందరు భయపెట్టు వారును, మరికొందరు వద్దువద్దని బ్రతిమాలు వారునై యుండిరి.ఆ జన సమూహమునుండి నిరోధకబుద్ధి, మందబుద్ధి యనువారిరువురు ఆ మనుష్యుని బలవంతముగా వెనుక కీడ్చుకొని వచ్చెదమని, వాని ననుసరించి పరుగెత్తిరి. అట్లు మహా ప్రయాసముతో తన్ను జేరవచ్చువారినిగాంచి యెచ్చటకు బోవుచున్నారని అతడడుగ, నిన్ను వెనుకకీడ్చుకొని పోవుటకని వారనిరి. అది మీ వలనగాదు. మీరు వినాశకమను పట్టణములో నివసించు చున్నారు. అది కొద్ది దినములలో నాశనమైపోవ అధఃపాతాళములో అగ్నిచేతను గంధకము చేతను గనగనమండెడి దుస్సహమైన కష్టపుగుంటలో బడి పోవనున్నారు. కావున సోదరులారా! మేలాశింతురేని నన్ననుసరించి రండని ఆమనుష్యుడనెను. మరిచితిని; యింత వరకును ఈ వ్యక్తిపేరైనను తెలుపనందులకు పాఠకులు మన్నింతురుగాక. అతనిపేరు క్రైస్తవుడు. అంత నా ముగ్వురకు ఈ క్రింది సంభాషణము జరిగెను.

నిరోధకబుద్ధి:- 'ఆ యేమంటివి మా బంధుమిత్రాదులను సంపదలను విడిచి రమ్మందువా?'

క్రైస్తవుడు:- 'అవును. మీరు పరిత్యజింపబోవు సమస్త వస్తువులును నేను వెతుకబోవుదానిలో శతాంశమునకైనను సరిరావు.

ని. బు:- 'అట్లయిన ఈ ప్రపంచమునే పరిత్యజించి ఆ మీదట నీవు వెదకబోవు ఆ మహా ఘన పదార్థ మెట్టిది?'

క్రై:- అనంతమును, అవినాశనమును, అవర్ణనీయ మునై మనకొరకై సిదముగానున్న మహానంద ప్రదేశ మును వెదుక బోవుచున్నాను. స్వర్గములో వెదుక బోవు వారికది యుద్దేశింపబడి భద్రమైయున్నది. వలయునేని ఈ గ్రంథమును విప్పి చదువుడు.

ని. బు:- ఈ 'నీ గ్రంథము నావల చింపి పారవే యుము. మా వెంట వచ్చెదవా లేదా?'

క్రై:- నే నీ కార్యము నందే దీక్షబూనుటచే రా నని చెప్పుచున్నాను.

ని. బు:- 'మిత్రమా మందబుద్ధి! మరలి పోవుదము రమ్ము. ఈ మూర్ఖు లెందరు చెప్పినను వినిపించు కొనరు. పైగా తమదే సత్యమార్గమని వాదింతురు.'

మంద బుద్ధి:- 'వేగిర పడవద్దు. ఈతడు చెప్పుచున్న ఈ మహానంద ప్రదేశమే ఒకటున్న పక్షమున, అది మన యీ సమస్త సంపదల కన్నను మిన్నయైనదిగదా? నాకెందుకోగాని ఇతని ననుసరింప వలయునన్నబుద్ధి పుట్టు చున్నది.'

ని. బు:- 'ఓహో మందబుద్ధికి మరియొక మూర్ఖబు ద్ధియా! మేలు మేలు! బుద్ధిమంతుడవేని నా మాటలు నమ్మి మరలిరమ్ము. ఈ యున్మత్తుడు నిన్నెచ్చట కీడ్చుకొని పోవునో ఎవ డెరుగును?'

క్రై:-'సోదరుడా మందబుద్ధి! మారాడక నా వెంట రమ్ము. నా వచించిన దానిలో నసత్య మేమియులేదు. వల యునేని సత్య భాషణమును, దైవ ప్రోక్తమునైన ఈ గ్రంథమును విప్పి చదువుము.

మంద బుద్ధి:- 'నిరోధక బుద్ధి కొక్కమాట. నేనీ మనుష్యుని అనుసరింప గోరుచున్నాను, అయ్యా క్రైస్త వుడా! నీ చెప్పిన యీ ప్రదేశమునకు దారియెచ్చటనో నీ వెరుంగుదువా?'

క్రై:- 'సువిశేషకారుడు నన్నీ మార్గమున నిర్దే శించి, సమీపించు తలుపుపై తట్టిన, సత్య మార్గము అవ గత మగునని చెప్పినాడు.'

అట్లయిన మేలని మందబుద్ధియు క్రైస్తవుడును సాగి పోవుచుండ, నిరోధక బుద్ధి కోపించి 'దుర్బుద్ధులెతిరి! మీ కెట్టి యసుభములో! పొండు, పొండ'నుచు మరలిపోయెను. అప్పుడు వారిరువురు నిట్లు సంభాషింప దొడగిరి.

క్రై:- 'రమ్ము మిత్రమా శీఘ్రముగా బోవుదము నీబుద్ధికెంతయు సంతసము. ముందు రానున్న యనర్థముల నూహించి యున్న పక్షమున నిరోధకబుద్ధియు మనల ననుస రించి యుండెడివాడు.'

మ. బుద్ధి:- 'మనము తప్ప నన్యులెవ్వరును ఇందు లేరుగాన, నిర్భయముగా మనము పోవుచున్న ఆ ప్రదేశ మెట్టిదో యందలి శుభా శుభము లెట్టివో, వాని నేరీతి ననుభవింప వలెనో తెలియ జెప్పుము.'

క్రై:- నీ వడిగితివి గనుక నేనైతే చెప్పకుండ నా యీ గ్రంథమునుండి నీ యడిగిన ప్రశ్నకు ఉత్తరమును జదివెదను, సావధానబుద్ధితో నాలకింపుము.

మ. బు:- ఆ పుస్తకములోని సుద్దులన్నియు సత్యములని నీ వెట్లు విశ్వశించితివి?

క్రై:- సత్యమూర్తిచే నీ గ్రంథము నిర్మింపబడినది గాన, దీనిలోని వార్తలన్నియు సత్యములే.

మ. బు:- మంచిది. ఆవార్తలెట్టివో చదువుము.

క్రై:- "అనంతమైన సామ్రాజ్యమును సదా మన మాక్రమింతుము. అందు మనకు నిత్యజీవిత మీయంబడును."

మ. బు:- ఇంకేమైనను గలదా?

క్రై:- "మహిమానిత్వములైన కిరీటములను సూర్యునివలె ప్రకాశవంతమైన వస్త్రములను మనమందు ధరింతుము."

మ. బు:- 'మేలు' ఇంకేమైనను గలదా?'

క్రై:- "అచ్చట విచార విలాపాదు లేమియు నుండవు. ఏలయనగా ఆ ప్రదేశస్వామి మన నేత్రములనుండి దుఃఖబాష్పములను తుడిచి వైచును."

మ. బు:- అచ్చటి మన మిత్రు లెవ్వరు?

క్రై:- "దేదీప్యమానులై కాంతిమంతులై ప్రకాశించెడి దూతలును, అతి దూతలును అచటి మనమిత్రులు. ప్రేమస్వరూపులై పవిత్రహృదయులై దైవసాన్నిధ్యములో

సదా సంచరించు పితామహులను, స్వర్ణకిరీటధారులను మన మచట చూడగలము. పవిత్ర కన్యకలు మనకు నేత్ర పర్వ మొనర్తురు. ఈ ప్రపంచములో ఖండ ఖండములుగా ఖండింపబడి, అగ్ని జ్వాలల కాహుతియై క్రూరమృగముల కాహారమై, సముద్రములో ద్రోయబడి, ఆ పరలోక ప్రభువుపైగల మమతచే నానా బాధలనోర్చిన పుణ్య మూర్తులను అమృత స్వరూపులను మన ముందు దర్శింతుము."

మ. బు:- నీ చదివిన విషయము హృదయానంద కరమై యున్నది. కాని, ఆ మహా సామ్రాజ్యములో మనము భాగస్థుల మగుట ఎట్లు?

క్రై:- నా యీ గ్రంథములో నిట్లు వ్రాయబడి యున్నది. "మనఃపూర్తిగా వాంఛింతురేని ప్రతిఫలాపేక్ష లేని ప్రేమమూర్తి పరలోకకర్త మీకా సామ్రాజ్యము నీయగలడు."

అట్లు సంభాషించుచు బోవుచున్న వారిరువురను నేను స్వప్నములో జూచుచుండగ నే మైదాన మధ్యములో నిరాశయను పేరిటి ఊబి గుంటలో అకస్మాత్తుగా దిగబడి పోయిరి. తన వీపుపైనున్న ఘనభారముచే క్రైస్తవుడు మరింత లోతునకు జారిపోయెను. అప్పు డేమిచేయునదియును దోపక దుఃఖితులై యుండ, మందబుద్ధి ఎలుగెత్తి 'ఓయి క్రైస్తవుడా! ఇప్పు డెందుంటివ'ని యరిచెను. ఎందుంటినో నే నెరుంగనని క్రైస్తవుడనెను. అందులకెంతయు కోపించి మందబుద్ధి దుర్బుద్ధుడై 'మూర్ఖుడా దారి వెంట దాంబి కుడవై నోటికి వచ్చినట్లు వదరితివే? ఆ యమందానంద

వ్రిదేశము ఈ బురదగుంటయే కదా! మొదటి ముద్దలో నే ఈగ పడినదన్నట్లు, తొలుతనే ఇట్టి యశుభములు దాపు రింప నింక దరి జేరుటెట్లు? ఆ మహా సామ్రాజ్యమును నీవే ఏలుకొమ్ము' అనుచు దాపుననే యున్న వాడగుటచే కొలదిపాటి ప్రయత్నముతో నే ఒడ్డునకు జేరి, చచ్చి బ్రతికి నంత సంబరముతో మందబుద్ధి వెనుతిరిగి, గృహాభిముఖుడై నడచిపోయెను. అప్పుడు క్రైస్తవు డొంటరిగాడై దీన దృష్టితో ఒడ్డునబడిన చేపవలె నిలునటు కదులాడెను. తలకు మించిన బరువును మోయుచున్న వాడగుటచే ప్రయత్నము లన్నియు వమ్మైపోవ, మరింత లోతునకు దిగజారి పోయెనే గాని, ఒడ్డు చేరజాలడయ్యెను. అంతలో సహాయకుడను పేరిట సజ్జనుడొకడు క్రైస్తవునిజేరి, యిచ్చట నేమి చేయుచుంటి వనెను. 'అయ్యా సువిశేషకారుడు నన్నిమార్గమున పొమ్మని నిర్దేశింప వచ్చుచు కాలుజారి యీ బురదలో కూరుకొంటి న'ని క్రైస్తవు డనెను. మంచిమార్గమున అనుగమింపక బురదలో నేల కాలిడితివన, భయముచే వణకుచుండ కాలు జారినదని క్రైస్తవు డనెను. సహాయకుడు క్రైస్తవుని కరు ణించి వాని హస్తమును గ్రహించి, బురదగుంటనుండి పైకి లాగి, గట్టిమార్గమున నిల్పి, నీ కోరిన స్థలమునకు పొమ్మని చెప్పెను. ఆ పాటికి మందబుద్ధి తన యిల్లు చేరెను. ఇరుగు పొరుగు వారందరును వానిని క్రమ్ముకొనిరి. 'క్రైస్తవుని వంటి ఉన్మత్తునితో నేలపోయితివ'ని కొందరు దూషించిరి., బుద్ధిమంతుడు గనుకనే వెనుకకు తిరిగి వచ్చెన'ని కొందరు భూషించిరి. 'ఒకటి రెండు కష్టములకే పందవై పరుగెత్తి తివా'యని మరి కొందరు అపహసించిరి. ఎవరేమన్నను

మారాడక, తనదే తేలికైన పనియన్న విశ్వాసముతో మందబుద్ధి శిలాప్రతిమవలె నిశ్చింతగా కూర్చుండెను. వారి దూషణ భూషణములు దున్నపోతుపై వర్షమువలె మందబుద్ధిపట్ల నిరుపయోగము లైనందున, చేయునదిలేక వారెల్లరు ఒక్కుమ్మడిగా క్రైస్తవుని ఆడి పోసికొనిరి.

అట్లు క్రైస్తవుడు నిశ్చింతతో కొంతదూరము నడిచి పోయి, ప్రపంచ జ్ఞాని యనబడు ఆజాను బాహువు నొక్కని గలసికొనెను. అతడు కామపురమను మహానగరమునుండి వచ్చుచుండెను. ఆ పరిసరములలో క్రైస్తవుడు వినాశక పట్టణమును త్యజించి, యెచ్చటికో పోవుచుండెనని అప్పటికే గోలగా జెప్పుకొను చుండిరి. ఆ యాత్రికుని వాలకమున కనుమానించి, అనతే ఆవులించిన ప్రేగులు లెక్కబెట్టుకొను వాడగుటచేత ఆ ప్రపంచజ్ఞాని మెల్లగా క్రైస్తవునితో సంభాషణము ప్రారంభించెను.

ప్ర. జ్ఞాని:- 'అయ్యా! ఈ విపత్ భారముతో నెచ్చట కేగుచున్నావు?

క్రై:- 'అవును విపత్ భారమే, యెచ్చటి కంటువా? అదుగో ఆ సూక్ష్మద్వారము నొద్దకు. అచ్చటనుండి నా యీ భారము సమసి పోగలదు.'

ప్ర:- 'నీకు భార్య బిడ్డలున్నారా?'

క్రై:- 'ఉన్నారు కాని ఈ భారముచే కృంగి, కృశించి నశించు చున్న వాడనగుటచే, వారలపై నాకు పూర్వాను రాగము లేదు. అసలు వారున్నారను అభిప్రాయమే యిప్పుడు లేదు.'

ప్ర:- 'అట్లయిన నేనిచ్చు సలహా పాటించెదవా?

క్రై:- 'సద్భ్రాతా నాకు అత్యంత అవసరమై యున్నం దున నీ చెప్పు వాక్యములు మంచివేని తప్పక పాటించెదను.'

ప్ర- 'నీవు మోయుచున్న ఈ భారమును వెంటనే జార విడువుము. అప్పుడే దైవ మనుగ్రహించిన సంతోష మును నీ వనుభవింప గలవు.'

క్రై:- 'అదే నేనును వెదకుసది. కాని యీ భార మును నా యంతట నేను జారవిడువలేను. మన దేశములో నెవరుగాని యీ భారమును నా యొద్ద నుండి తీసివేయ లేరు. అందుకే యీ మార్గమున నిర్దేశింప బడిన వాడనై పోవుచున్నాను.?

ప్ర- 'నిన్నీ మార్గమున నిర్దేశించిన దెవ్వరు?'

క్రై:- సువిశేషకాడుడను గౌరవ మర్యాదలు గల పెద్దమనిషి.

ప్రా:- వాని మార్గము దుర్మార్గము సుమీ! ప్రపం చములో నింకెవ్వడును నిన్నిట్లు నిర్దేశింపడు. నీ విప్పుడే అపాయమునకు లోనైతివనుటకు నీ యొడలిపైనున్న ఈ బురదయే సాక్షి. ఈ మార్గమున బోవు వారికి ఆ గుంట యొద్దనుండి ఒకటే విచారము. ప్రాయములో నీకంటెను పెద్దవాడను కావున నా వాక్యము వినుము. ఈ మార్గమున బోవువారికి ఆయాసము, బాధ, ఆకలి, కత్తిపోటులు, సిం హాములు, రాక్షసులు ఓ— ఒక్కటేమిటి చివరకు మర

ణాముకూడా ధృవమని నే నెరుంగుదును. వలయు నేని నూరు సాక్ష్యములు సిద్ధము. ఊరు ఉనికి నెరుంగని పొరుగువానిని నమ్మి నీ విట్లు బయలు దేరుట అనుచితము.

క్రై:- నా మోయు యీ భారమునకు నీ చెప్పిన యీ బాధలన్నియు నేకమైనను సరిరావు. ఆ బాధలన్నియు అనుభవించియైనను ఈ భారమును తొలగించు కొన గోరు చున్నాను.

వ్ర:- నీ వింతటి భారమును మోయు చున్నట్లు నీ కెట్లు తెలిసినది?

క్రై:- 'నా చేతనున్న ఈ గ్రంథమును పఠించుటచేత.

వ్ర:-' నేనును అట్లే తలంచితిని. నిను బోటి బలహీనులు లేనిపోని అనవసర కార్యములలో జిక్కుకొని, ఆయాస ప్రయాసలకు గురియై నశించుచుందురు. వానివలన మీకేమి కలుగ నున్నదియు మీ రెరుంగరు.

క్రై:- నాకేమి కలుగ నున్నదియు నే నెరుంగుదును. భరింపరాని యీ భారముకన్నను......?

వ్ర:- అయినను లెక్కలేనన్ని అపాయములతో నిండియున్న యీ మార్గమున నీ వేల పోవలయును? నీవు పోవు పనికి నేనొక నిరపాయమైన మార్గము జూపగలను. పైపెచ్చు నా మార్గములో భద్రత, సంతోషము, మిత్రత్వ మును ఒనగూర్పగలను.

క్రై:- అట్లయిన కరుణించి నీ మార్గ మేదియో చూపి పుణ్యమున బొమ్ము.

ప్రః- ఈ సమీపమున ధర్మపురమను పట్టణము గలదు. అందు నా మిత్రుడు న్యాయ బుద్ధియనువాడు, యాత్రికుల కండయైనవాడు, పేరు ప్రతిష్టలు గలవాడు నివసించు చుండును. అతడు నీకు తప్పక సహాయ పడగలడు. మైలు దూరముననే వాని గృహము కలదు. ఇప్పుడే నీ వచ్చుటకు బొమ్ము. ఇంకొక్కమాట. నీ వింటికి బోయి, నీ భార్య పుత్రుల నిచ్చుటకు దీసికొని రమ్ము. ఇందనేక గృహములు నివాస యోగ్యములై యున్నవి. ఈ పట్టణపు జీవితము చాల సౌఖ్యవంతము. నాగరకతా పరిపూర్ణము. నీవీ ధర్మ పురిలో సుఖముగా కాలము గడుప వచ్చును.

క్రై:- ఆ న్యాయబుద్ధి గృహమునకు మార్గమేది?

ప్రః- ఆ యున్నత పర్వతము అగుపించు చున్నది గదా! ఆ కొండ మలుపుననే ఆ యూరు. ఆ యూరిలో ప్రథమ గృహమే వానిది.

కత్తిపై తేనియ నాశించినట్లు, క్రైస్తవుడా ప్రపంచ జ్ఞాని వాక్యములకు ఉబ్బిపోయి, తాను నడుచుచున్న మార్గము దప్పి, న్యాయబుద్ధి గృహము నుద్దేశించి నడిచి పోయెను. ఆ పర్వత మతి దీర్ఘమై చుక్కల పొడువున నెదిగి యుండుటచే, క్రైస్తవుడు నాలుగు అడుగులువైచి మిక్కిలిగా నిరాశ జెందెను. అతని భారము ముమ్మడి యగుటచే భయ భ్రాంతుడై నిలిచి పోయెను. అంతలో పర్వత మధ్యప్రదేశమున అగ్ని జ్వాలలు భయానకమై ప్రజ్వరిల్లెను. ఆవైపు చూచు సరికి క్రైస్తవునకు ముచ్చెమటలు పోసి, చేష్టలు దక్కి అచ్చటనే నిలుచుండి ప్రపంచ జ్ఞాని దుర్బోధలు

విన్నంపుకు మిక్కిలిగా పరితపించెను. అంతట తలవని తలంపుగా సువిశేషకారుడు క్రైస్తవుని కెదుట గన్పించెను. అతడును సిగ్గున దిగ్గున శిరము వంచెను. ఇచ్చటికేల వచ్చితివని సువిశేషకారుడు గంభీరమైన స్వరముతో ప్రశ్నింప, చెప్పుటకు నోటమాటరాక క్రైస్తవుడు మాన్పడి నిలుచుండెను. 'వినాశకమను పట్టణము నుండి బయలుదేరిన యాత్రికుడవు నీవే గదా! నిన్ను నేనే గదా సత్యమార్గమున నిర్దేశించినది? ఇప్పుడీ దుర్మార్గ ప్రవర్తన యేమి, ' టని అతడు గద్దించెను. యాత్రికుడు వ్రేలువద్దవాని వలె తగ్గి, 'అయ్యా మార్గ మధ్యమున ప్రపంచ జ్ఞానియను వానిని గలిసి కొంటిని. అతడును బుద్ధిమంతునట్లును, పెద్ద మనిషి వలెను నటించి, నా యోగ సమాచారము లడిగి నా కీడెంచి, మేలెంచు దయాపరునట్లు నాకీ మార్గము జూపినాడు. ఇంతలో నే ఈ విపత్తులో జిక్కికొంటి న' నెను. ఉపదేశకుడు చిరునవ్వు నవ్వి తన గ్రంథమును విప్పి ఇట్లని పఠించెను. "నీ మేలెంచి నీతో సంభాషించువారికి నీవేల పరాఙ్ముఖుడ వయ్యెదవు? బుద్ధిమంతులు విశ్వాసముచే జీవించు చున్నారు. విశ్వసింపని వారియెడల నా కభిమానము లేదు." అట్లు పఠించి యేమందువని క్రైస్తవుని వైపు పరికింపగా నతడు 'అయ్యో హాత భాగ్యుడను' దోహిని నేనేమి చేయగలనని దీనవదనుడై విచారించెను. ఉపదేశకుడు వాని కుడిచేతి నెత్తి పట్టుకొని, పశ్చాత్తాప వంతుడైన పాపాత్ముడు సదా మన్నింపబడును. విశ్వాసము నిన్నుద్ధరించు గాక. నాయనా! ప్రపంచ వ్యాపారములలో పరిభ్రమించు వాడొక మాయావి. వానిస్నేహితు డంతకన్నను మాయల

మారి. వారేమిటి నిన్ను ధ్వరించు టేమిటి. జగదీసుని పట్ల నిట్టి యుపచార మేనాటికిని ఇకమీాదట చేయకుందువుగాక! అని హిత ముపదేశించుచుండ క్రైస్తవుడు కన్నీరు గార్చుచు దైవము నన్నను గ్రహించుగాక యని దుఃఖించెను. ఉపదేశకుడును 'అల్లదే నా నిర్దేశించిన సన్మార్గము. శీఘ్రుమే పొమ్ము. నీకు మేలగుగాక, యని చిరునవ్వుతో పల్కెను. క్రైస్తవుడును మంచి మార్గమునకు బోయి ఈ మారు పరులు పలకరించినను పలుకక బహుదీక్షతో సాగిపోయెను. కొంతదూరమట్లు నడిచి నిర్దేశితమైన సూక్ష్మ ద్వారమును సమీాపించెను. అచ్చట కవాటముపై "తట్టుడు తెరువ బడును" అని వ్రాసి యుండుట గమనించెను. ఒకటి రెండు మారులు ఆ తలుపు తట్టి జగన్నాధుడగు జేసు నాధుని సన్నుతింప పాపినైన నే నర్హుడ నేని జాగరూకుడై సదాయిట కాపుండు ప్రభువు లోని కరుగ నా కాజ్ఞ దయచేయు గావుత మనెను. అప్పుడు సుబుద్ధియను వృద్ధుడు తలుపును తెరచి, నీ వెవరవని ప్రశ్నించెను. అయ్యా పాపభారముచే పరితపించు క్రైస్తవుడను. వినాశక పట్టణమునుండి స్వర్గ సామ్రాజ్యమున కేగుచు ప్రారంభమున ఉపదేశకునిచే ఈ సూక్ష్మ ద్వారము వైపునకు నిర్దేశింపబడితినని యాత్రికు డనెను. అట్లయిన మేలు రారమ్మని లోనికి బిల్చి చేయూత నిచ్చి లోనికి లాగెను. ఇట్లేల లాగుచున్నావని క్రైస్తవుడన 'నాయనా, అల్లదిగో కన్పించు ప్రాసాదము నుండి సైతానుడైన బెల్జబూబును వాని యనుచరులును ఇటవచ్చు యాత్రికులపై బాణములు రువ్వి చంప జూతురు. వాని బారినుండి నిన్ను రక్షించితిన'ని సుబుద్ధి యనెను. నీవొక్కడవే ఇం

చేల వచ్చితివి? నీ జాడ నెరు నెరుంగరా యేమి అని సుబుద్ధి యడుగ, తానెట్లు బయలు దేరినదియు, భార్య పుత్రులెట్లు తన్నాటంక పరచి నదియు, మంద బుద్ధి, ప్రపంచజ్ఞాని ప్రభృతుల యుదంతమును సవిస్తరముగా వివరించెను. అట్లు సంభాషించుచు కొంత దూరము నడిచిన పిమ్మట సుబుద్ధి 'నాయనా' ఇదిగో ఈ ఇరుకు త్రోవనుండి నీవు పయనింప వలసియున్నది. పితా మహులును, దీర్ఘ దర్శులును, ప్రభు వైన రక్షకుడును ఈ మార్గముననే నడిచి పోయిరి' అనెను. మరి ఈ మార్గము సేరుగా నున్నదో లేదో వంక త్రోవలు, చీలిక మార్గములు నన్ను దారి తప్ప జేయునేమో గదా యని క్రైస్తవుడు సంశయ గ్రస్తుడయ్యెను. 'అవును. అట్టిమార్గ ములెన్నియేనియుం గలవు. కాని దుర్మార్గమేదో, సన్మార్గ మేదో నీ వెరుంగుదువు. నా చూపిన ఈ మార్గముననే కొంతదూరము పోవుదువేని, అచ్చట వ్యాఖ్యానకుని గృహ మును జూతువు. ఆ సత్పురుషుడు కొన్ని వింత దృశ్యములు నీకు చూపగలడని సుబుద్ధి యనెను. క్రైస్తవుడును అతని సెలవు దీసికొని సాగిపోవుట స్వప్నములో చూచితిని.

అట్లు నడచి పోయి పోయి క్రైస్తవుడు వ్యాఖ్యాన కుని ఇంటితలుపు తట్టెను. తట్టి 'అయ్యా నేను క్రైస్తవుడను. ఉపదేశకుడును సుబుద్ధి నిర్దేశింప సహాయార్థము ఇచ్చటికి వచ్చితిని, అని చెప్పెను. అతడును సంతోషముతో లోని కా హ్వానించెను. కొంత తడవు ముచ్చటలాడిన పిమ్మట క్రైస్త వుని తన తోరమ్మనుచు నొకగది తెరచెను. అందలి గోడపై చిత్రమొకటి వ్రాయబడి యున్నది. అగ్ని గుండము వెలుగు చుండ దానిపై వేరొకడు నీళ్లు చల్లుచుండెను. కాని యా

నిత్య దేదీప్యమానమై ఉష్ణసంభరితమై క్షణ క్షణ ప్రవర్ధమాన మగుచున్న దీకాని చల్లారుట లేదు. ఇది వింతగదా యని క్రైస్తవుడనెను. వ్యాఖ్యానకుడు నాయనా! ఈ యగ్నిగుండము హృదయము. జ్వాలలు దేవవరప్రసాదము. నీళ్లు చల్లువాడు సైతానుడు. దయ్యా మెప్పుడును దైవ మనుగ్రహించిన వరప్రసాదములను అపహరింప జూచుచుండును." అనెను. మరి ఈ జ్వాలలు వృద్ధియగుట ఎట్లని క్రైస్తవుడడిగెను. అతడు "నీవు చిత్రమును పూర్తిగా జూడవైతివి. అదిగో గోడచాటున వేరొక వ్యక్తి చాటుగా నూనె నా యగ్నిలో గుమ్మరించు చున్నట్లు చిత్రింపబడినది. దీనియర్థమేమన ఆవ్యక్తి మనదేవుడైన సర్వేశ్వరుడు. వరప్రసాదమును తరుగకుండ వలయువారి కెప్పుడును అనుగ్రహించుచునే యుండును అనుచు వ్యాఖ్యానకు డతనిని వేరొక గదిలోనికి దీసికొని వెళ్లెను. అచ్చట జనసమూహము ముందుకు బోవ ప్రయత్నించుచు పోవుటకు అసమర్థమై నిలిచియుండెను. ఏలయనగా అటనొక భటసమూహము విచ్చుకత్తులతో గస్తీ గాయుచుండెను. ఉద్యోగి యొకడు ధైర్యముతో ముందునకు బోవు వారెవ్వరును లేరా యన చాల తడవునకు అజాను బహుడును, దృఢకాయుడును నైన పురుషుడొకడు ధైర్యముతో నేనని ముందునకు వచ్చెను. వెంటనే భటులకును వానికిని ఘోరమైన పోరాట మారంభమాయెను. అతడును మహా శౌర్యముతో ఆభటుల నెల్ల మార్కొని శిరములు ఖండించి విజయ వంతుడై సాగిపోయెను. అంతట సూర్య ప్రభతో తళ తళ మెరయు సుజ్వాలాకారులు ఎదురువచ్చి స్వాగతమునిచ్చి శాశ్వతసౌఖ్యము

పీయుంజాలు రత్నమయ సింహాసనముపై వాని నధిష్ఠింప జేసిరి. ఈ దృశ్యమును గాంచిన క్రైస్తవుడు దీని యర్థమును నేనెరుంగుదును, తెమ్మనెను.

అంతట వ్యాఖ్యానకుడు అతనిని వేరొక గదిలోనికి దీసికొని పోయెను. అందొకడు అప్పుడే గడగడ వణకుచు మంచముపై నుండి లేచుచుండెను. నీవిట్లేల వణకుచున్నావని క్రైస్తవుడడుగ నామనుష్యు డిట్లనెను. ఈరాత్రిలో స్వప్నమున పరమండలములో ఉరుములు మెరుములు భయానకమై గర్జిల్లుట గాంచితిని. అప్పుడు మేఘారూఢుడై ప్రభువు ఇరువైపుల దివ్యమూర్తులు తన్ను సేవింప మృతజీవులారా! తీరుపునకు రండని పిలచెను. ఆక్షణమే మృతజీవులు సమాధులను తెరచుకొని వచ్చుచుండ, కొందరు సంతోషముతో నుప్పొంగువారును, మరికొందరు దుఃఖముతో కుందువారును నైయుండిరి. అప్పుడు సర్వేశ్వరుడు ఫలప్రదమైన ధాన్యమును కొట్లలో భద్రపరచి, తాలు, చెత్త, పొట్టు, అగ్నిగుండమున ద్రోయుడని తన పరిచారకుల కనుజ్ఞ నిచ్చెను. ఆక్షణమే నేనున్న ప్రదేశ మగాధమై పోవ అగ్నిజ్వాలలు దాని నావరించెను. నేనొక మూల దాగితినిగాని, సర్వేశ్వరుడు నావైపునకే దృష్టి ప్రసరించెను. అప్పుడు నా దేహము కంపింప గడగడలాడుచు మేల్కొంటిని అనెను. వ్యాఖ్యానకుడును, 'వింటివా' యని యాత్రికుని హెచ్చరించి మరి కొన్ని వింత దృశ్యములు జూపి నాయనా! తడవైనది. నీవిక నిశ్చింతగా బోవచ్చును. నీమార్గము సౌఖ్యదాయకమై నీ ప్రయత్నము జయప్రదమై సాగుగాక. సర్వేశ్వరుడు నిన్ననుగ్రహించుగాక. పోయి రమ్మని సాగనంపెను.

అట్లు క్రైస్తవుడు సాగిపోవుచు, తాను చూచిన వింత దృశ్యములను దలంచుకొని కొన్నింటికి కక్కజ పడుచు, మరి కొన్నింటికి భయపడుచు నడచి పోవుచుండెను. ఆతడు నడచు మార్గమున కిరుప్రక్కల రక్షణమను పేరిటి గోడ కట్టబడియుండి మార్గము సురక్షితమై యుండెను. కొంత దూర మేగినపిమ్మట నొకసమాధియు దానిపై నొక స్లీవయు కనిపించెను. ఆ స్లీవనుండి దివ్యజ్యోతి యొకటి ప్రసరించు చుండెను. ఆ జ్యోతివలన నాప్రదేశమంతయు దేదీప్యమానంగా వెలిగిపోవు చుండెను. అచ్చటి కరుగగనే క్రైస్తవునికి భారమంతయు ఒక్కసారిగా జారిపోయెను. దాని కాతఁ డెంతయు నక్కజము పడెను. అతని నోటినుండి అప్రయత్నముగా "ప్రభువు దుఃఖించి, నన్ను సంతోషింప జేసెను. ఆయన మృతుడై నన్ను జీవింపజేసెను" అన్న వాక్యములు వెలువడెను. హృదయ మొక మధురానుభూతికి తావలమైయుండ కన్నులవెంట ఆనంద బాష్పములు రాలుచుండ నాతడు తదేకదృష్టితో స్లీవవైపు చూచుచుండెను. అప్పుడు ముగ్గురు దివ్యమూర్తులు ప్రత్యక్షమై, నీకు సమాధానమగుగాక. నీ పాపములు మన్నింపబడినవి యనిరి. తమ శ్రీముద్రిక నిడిన శ్రీముఖము నొకదానిని అతని కొసంగి స్వర్గ ద్వారమునొద్ద జూపుమని హెచ్చరించిరి. అంతట నానిద్రలో యాత్రికుడు ముందున కరుగుట జూచితిని.

అట్లు కొంతదూర మేగునరికి మార్గము ప్రక్కన ముగ్గురు నిద్రించు చుండుట నాతడు చూచెను. వారు తుచ్ఛుడు, సోమరిపోతు, మూర్ఖనాథుడు ననువారు. యాత్రి

కుడు వారినుద్దేశించి, ఓహో! ఇందేల నిద్రించెదరు? మృత్యు సముద్రపు టలలు మిమ్ములను తాకుచున్నవి. గర్జించు సింహములు మిమ్ములను సమీపించుచున్నవి. లెండు లెండని కేకలు వేసెను. వారును త్రుళ్లిపడిలేచిరి. అందు క్షుద్రుడు ఇప్పుడేమి యుపద్రవము వచ్చిన దనెను. మరికొంతసేపు నిద్రించుదముగాక యని సోమరిపోతనెను. మాజోలి నీకేల, నీ దారిన నీవు పొమ్మని మూర్ఖనాథు డనెను. ఇట్లనుచు వారు మువ్వురును మరల నిద్రింప, క్రైస్తవుడు తనదారినే సాగి పోయెను. మరికొంత దూరము పోవునప్పటికి ఇరువురు వ్యక్తు లాతనిని గలసికొనిరి. వారు కుపరీక్షకుడు, దుర్మార్గగామి నను వారలు. వారును స్వర్గ సామ్రాజ్యమునకు బోవుచుండిరి. యాత్రికుడు వారినుద్దేశించి 'అయ్యా మీరీ మార్గమునకు ప్రారంభ ద్వారమునుండి ఏల రారైతిరి? దొంగలవలె మధ్యే మార్గమున రక్షణ ప్రాకారము నధిగమించి ఇందు రానేల' అనెను. వారు 'అది మాకు చాల దూరము. మా ప్రాంతీయు లెల్లరును దగ్గరత్రోవ నన్వేషించుచు, ఇట్లే గోడదూకి వత్తురనిరి. ఈ సామ్రాజ్యస్వామి మీచర్య నేరముగా భావింపడా? న్యాయమూర్తి మిమ్ము దండింపడా యని క్రైస్తవుడడుగ వెయ్యేండ్లనాటి మాయీ ఆచారము న్యాయమూర్తికిని న్యాయముగనే దోచును. కాకున్నను బహిర్ద్వారమునుండి వచ్చిరా లేదా యని ప్రశ్నరాదు. ఏవిధినైనను మార్గములో జేరుటయే పరమార్థము. కాదందు వేని ఇప్పుడు మనమువ్వురము ఇదియే మార్గమందున్న వారముగదా? మనలో భేదమేమి? అని వారు ప్రశ్నించిరి. క్రైస్తవుడును 'నాయకులారా! అట్లు గాదు. నేను నా యజ

మానునిచే నిర్దేశింపబడి యిందు వచ్చితిని. మీరో యనిన మీ సొంత ప్రయత్నములతోనేగదా యిటకు వచ్చిరి. అసలు మీరెవరు మన యజమానునికి తెలియునా? కష్ట సమయములలో మిమ్మాతడు ఉద్ధరించునా? అట్లగుట మీరు స్వర్గ సామ్రాజ్యము సురక్షితముగా జేరుదురా?' అనెను. ఈ మారు వారేమియు ఉత్తర మీయరైరి. యాత్రికుడు మరి కొంత సేపు మాట్లాడి సమాధానము లేనికతన నిశ్శబ్దముగ నడచిపోయెను.

అట్లు పోయిపోయి వారు కష్టపర్వతమను పేరిటి కొండను జేరుటను స్వప్నమున గాంచితిని. అటనొక మంచినీటి చలమను గాంచి వారందరు ఆనీటిని త్రాగిరి. అచ్చటనుండి ఆమార్గము మూడుపాయలై ఒకటి నిలువుగా కొండపైకిని రెండు సాపుగా కొండప్రక్కకును బోవుచుండెను. కొండపై కెక్కుమార్గము ఇరుకైనదియు, నిలువుగా నెక్కునదియునై కష్టపథమను పేర నొప్పియుండెను. మరిరెండు మార్గములు విశాలములై మిట్ట పల్లములులేక చూచుటకు నునుపుగా నుండెను, కాని యవి 'వినాశ మార్గము' 'అపాయ మార్గము' అను పేళ్లనొప్పి యుండెను. క్రైస్తవు డిక్కడ కొంచె మాలోచించి కష్టపథము ననుసరించి పోయెను. కుపరీక్షకుడు దుర్మార్గగామి ఈ విశాల మార్గములుండ మనమీ కష్టమార్గమున నేల పోవలయును? ఈదారులును పర్వతము ప్రక్కగాదిరిగి మరల క్రైస్తవు డేగుచున్న త్రోవలోనే కలియునేమో? నదు లెన్ని మెలికలు దిరిగినను ఎక్కడెక్కడ ప్రవహించినను చివరకా సముద్రముననే కలియును గదా. ఇది మనము సూక్ష్మబుద్ధిచే గ్రహించితి

మని మెచ్చుకొనుచు, అపాయ మార్గము ననుసరించి యొకడు పోయెను. ఆమార్గ మొక మహారణ్యమువరకును బోయి అచ్చట నాగిపోవుటచే వాడచట దిక్కులేనివాడై అలమటించెను. వేరొకడు వినాశమార్గమునబోవ, నదియున్న తమై వెలుగునైన ప్రసరింప నీయని చీకటి కొండలలోనికి గొంపోయి అచ్చట ఆగిపోయెను. వాడచ్చట క్రిందబడి మరల లేవనే లేదు.

ఇక క్రైస్తవు డేమియాయెనాయని వానివైపు జూచితిని. ఆత్రోవ చాల ఇరుకైయున్నందున నతడు పడుచు లేచుచు, వంగుచు కూర్చుండుచు, దోగాడుచు ప్రాకుచు మెల్లగా పర్వతము నధిరోహించి అగ్ర భాగము చేరెను. మార్గస్థుల విశ్రాంతికై అచ్చట లతామంటపము ఒకటి నిర్మింపబడి యుండెను. క్రైస్తవుడందు విశ్రమించి, తనచేతి గ్రంథమును కొంతచదివి నిద్రావరవశుడై చాలతడవు మైమరచి నిద్రించెను. ఆ నిద్రలో మున్నతని కీయబడిన శ్రీముఖము జారిపోవుట నాత డెరుంగడు. స్వప్నమున నెవరో అతనిని తట్టి "సోమరిపోతా! చీమలను జూచియైనను తెలివి తెచ్చుకొనరాదా" యని హెచ్చరించెను. ఆహెచ్చరికకు ఉలికిపడిలేచి తత్‌క్షణమే ప్రయాణమై ముందు నడచెను. కొంత దూరమేగుసరికి ఇరువురు వ్యక్తులు పిరికి పంద, అపనమ్మకుడు అనువారలు వేగముగా వెనుకకు బరువెత్తుచుండ క్రైస్తవుడు వారినాపి ఇట్లేల పారిపోయెద రనెను. వా రిట్లనిరి. మేము స్వర్గసామ్రాజ్యమునకై బయలు దేరితిమి. పోయినకొలది సుఖములు లేవు; సరికదా కష్టములు మితిమీరుచున్నవి. మాకు దూరములో రెండు జంతువులు

సింహములవలె కన్పించినవి. అవి సింహములో కావో, మేల్కొనియున్నవో నిద్రించుచున్నవో మేమెరుంగము. కాని సింహములే యైనపక్షమున, మేల్కొనియే యున్నట్లయిన, మమ్మును ముక్కలు ముక్కలుగా చీల్చివేయునేగాని మరి బ్రతుకనిచ్చునా? అందుచే ధృతిచెడి వెనుకకు తిరిగి బుద్ధిమంతులమై పరుగెత్తుచుంటిమి. వారి వాక్యములు విని క్రైస్తవుడు అబ్బుర పడెను. అవును అట్టి అపాయకరమైన స్థితిలో ముందునకు బోవుటెట్లు? పోనీ వెనుకకు బోవుదమన్ననో తన పట్టణము అనతి కాలములో భస్మీభూతముగానున్నదే. ముందు నుయ్యి వెనుక గొయ్యి. అట్టి సంఘటనలో తన కీయబడిన శ్రీముఖము అప్రయత్నముగా జ్ఞప్తికి రాగ క్రైస్తవుడు తడిమికొని చూచెను. కాని ఎందున్నది? అతనికి గంగారు ఎక్కువైనది. కుడి భుజము కూలిపోయినట్లయినది. ఆశ్రీముఖమే లేకున్న ముందు మార్గములో తన ముఖమెవ డెరుగును? ఇంతకు దాని నెచ్చట జారవిడచినట్లు? ఇట్లొకింత వితర్కించుకొని పర్వతారోహణ సమయమున లతామంటపమున నిద్రించునప్పుడు దానిని జారవిడిచినట్లు క్రైస్తవుడు గ్రహించెను. అప్పటి యాతని విచారమింతయని వ్రాయ నలవిగాదు. వెనుకకు దిరిగి వచ్చుచు, తనలో "ఔరా పరమ దౌర్భాగ్యము కాకున్న పగటి పూట నిద్రయేమిటి? కష్ట సమయములలో జాగరూకులైయుందురుగాని మైమరచి హాయిగా నిద్రింతురా? పూర్వము ఇశ్రాయేలులును పాపమున పెచ్చుపెరిగిపోగా, ముందు వారుపోయిన ఎర్రసముద్ర మార్గముననే మరల వెనుకకు పంపివేయ బడిరట. అప్పుడు వారును ఇప్పుడు నేనును అయ్యో హతభాగ్యులము.

ఇట్లనుకొనుచు యాత్రికుడు మున్ను తాను విశ్రమించిన స్థలమును జేరెను. నలుమూలలు వెదకెను. అదృష్ట వశాత్తు ఒక మూల నా(శ్రీ)ముఖము గాంచి పెన్నిదిగన్న పేదవోలె క్రైస్తవుడు దానినందుకొని, హృదయమున కత్తుకొనుచు, ఆనంద బాష్పములు రాలుచుండ 'ఓ దయామయా నిన్నేమని కొనియాడుదు'నని గద్గద స్వరముతో ననెను. అంతట శీఘ్రగామియై ముందునకు నడచిపోవు చుండ సాయంకాలమై చీకట్లు క్రమ్ముచుండెను. సింహములు తన్నెక్కడ చీల్చివేయునో అనియు చీకటి పడక మునుపే తానా ప్రదేశ మతిక్రమించి పోవలయుననియు క్రైస్తవుడు నిశ్చయించుకొని పోవుచుండ, నొక సుందర భవనము, సౌశీల్యమమున సుందరభవనము గానుపించెను. ఆ భవనముపై లక్ష్యముంచి నడుచుచుండగా నిరుకైన మార్గము వచ్చెను. అచ్చట రెండు సింహములు భీకర మూర్తులై నిలుచుండి యుండెను. క్రైస్తవున కాసింహములు కంటబడగానే ముచ్చెమటలు పోసెను. గుండె దడదడ కొట్టుకొనెను. కదలికలు మాని చిత్తరువులోని బొమ్మవలె నిలుచుండి పోయెను. అప్పుడా గృహపాలకుడు జాగరూకుడనువాడు ఎలుగెత్తి పిల్చుచు 'ఓయి వెనుకకు బోనేల? ఆ సింహములు బంధింప బడియున్నవిగాన అపాయ మేమియు లేదులే నీసామర్థ్య మింత స్వల్పమా? నీ విశ్వాసము పరీక్షించుటకవి చిహ్నములు, రారమ్ము; అనెను.

క్రైస్తవుడు నివ్వెరపడుచు తన యవివేకమును నిందించుకొనుచు అయ్యా నేను వినాశక పట్టణమునుండి స్వర్గ సామ్రాజ్యాభిలాషినై వచ్చిన యాత్రికుడను. క్రైస్తవుడను

వాడను అనెను. మరి పొద్దు కుంకువరకు మార్గమున నేమి చేయుచుంటివన తాను శ్రీముఖమును బారవైచుకొనుట మరల దానినివెదకి తెచ్చుకొనుట అందుకైన జాగు క్రైస్తవు డెరింగించెను. జాగరూకుడును మంచిదనుచు ఇచ్చటి కవ్వ కలలో నొక్కతెను బిల్చెదను. తగుదువని తోచిన పక్షమున నిన్నామెలోనికి గొంపోవ గలదనుచు గంటకొట్టెను. అప్పుడు సుశీల యను సుందరాంగి మందగమనముతో మెల్ల మెల్లగా నడచివచ్చి, ఈ వచ్చిన నూతన వ్యక్తిని నీ వెవ్వ రవని ప్రశ్నించెను. యాత్రికుడు తన యుదందమ నంతయును పూసగ్రుచ్చినట్లు విన్నవించి, అమ్మా! నేనీ రాత్రి ఈ భవనముననే విశ్రమించెదను. ఇప్పుడీ బడలికతో ఈ పర్వతములు అరణ్యములు అతిక్రమించి పోజాల ననెను. అవిలాసిని భక్తిమతి, ధర్మావతి అను తన స్నేహితురాం డ్రను బిల్చి క్రైస్తవుడను యాత్రికుడు వచ్చెనని చెప్పెను. వారందరును కలియబలుకుకొని యాత్రికుని లోని కాహ్వ నించిరి. ద్వారములయొద్ద తదితర కన్యకలు స్వాగత మిచ్చుచుండ నాతడు తదంతర్భాగమునకు నడిచిపోయి ప్రాసాద మధ్యమున నొక్కచో గూర్చుండెను. అతనికి త్రాగుమని చక్కని పానీయ మొకదానిని తెచ్చి యిచ్చిరి. భోజనము తయారగువరకు నేదేని సల్లాపముతో బ్రొద్దు పుచ్చుదమని యాకన్యలు క్రైస్తవునితో నిట్లుసంభాషించిరి.

భక్తి;-'అయ్యా నీవిందు హాయిగా విశ్రమింప వచ్చును. నీమార్గములో నేమేమి వింతలు జరిగినవో చెప్పుద వేని విన గుతూహల పడుచున్నాము.'

క్రై;-'తప్పక చెప్పెదను. మీకు వలసిన విషయములన్నియు నడుగ వచ్చును.'

భక్తి;-'మొదట నీవేల యాత్రికు బయలుదేరితివి?'

క్రై;-'మా పట్టణము మహాపాయ స్థితిలోనున్నదని యెరింగి రక్షణార్థినై యాత్రికుడ నైతిని.'

భక్తి;-'ఈ మార్గమును నీ వెట్లెరింగి వచ్చితివి?'

క్రై;-'దైవానుగ్రహమువలన ఆస్థితిలో నెటుపోవుటకును దోచకున్న నన్ను సువిశేషకారుడైన యుపదేశకుడు హెచ్చరించి ఇదిగో ఇటుపొమ్ము. నీకు శుభమగునని ఈ మార్గము నిర్దేశించెను.'

భక్తి;-'దారిలో నీవేమేమి చూచితివి?'

క్రై;-'వ్యాఖ్యానకుడను పుణ్యమూర్తి తన గృహములో చాల విచిత్రమైన చిత్రములను జూపినాడు. ఆ దృశ్యము లిప్పటికిని నాహృదయమున ముద్రవైచినట్లు పాతుకొని యున్నవి. వేరొకటచో నొకస్లీవపైన ఆపాదమస్తకము రక్తసిక్తమై, వ్రేలాడుచున్న ఉజ్జ్వలమూర్తిని గాంచితిని. కాంచుట తోడనే నావీపుపైన నున్న భారమంతయు మహాద్భుతముగా నొక్కసారిగా జారిపోయినది. దానికెంతయు మాన్పడి యుండ జ్యోతిర్మూర్తి త్రయము ప్రత్యక్షమయ్యెను. అందొక్కడు బిడ్డా! నీపాపములు మన్నింపబడిన వనెను. వేరొక్కడు నాచీకిరి బాకిరి చింపిరి గుడ్డలను దీసివైచి దివ్యాంబరము లొసంగెను. మూడవ వ్యక్తి ఇదిగో ఈ శ్రీముఖము నొసంగెను.'

వివేకవతి;-'నీ మాతృ భూమిని గూర్చి నీ విప్పుడు తలంచుట లేదా?'

క్రై;- 'తలంప కేమి? కాని మాతృ భూమికన్నను గరీయమైన స్వర్గ సామ్రాజ్యమును నే నిప్పు డభిలషించు చున్నాను'

వివే;-'మరి పూర్వ గృహస్థ విషయములను గూర్చి నీ వేమియు బాధ పడుటలేదా.?'

క్రై;-'లేదు ఏలయనగా నాభార్యా పుత్రులతోను, బంధు జనులతోను, ఆస్తిపాస్తులతోను, లాభనష్టముల తోను, కష్టనిష్ఠురములతోను, పూర్వమున్న సంబంధమును పరిత్యజించితిని. ఇప్పుడీ స్లీవను ధ్యానించునపుడు తన్మయుడనై యున్నాను. ఈ దివ్య వస్త్రములను ధరించి ధృతిమంతుడ నైతిని. ఈ శ్రీముఖమును జూచి సంతోషచిత్తుడ నైతిని. అంతకన్నను కావలసిన దేమున్నది.'

వివే;-'అట్లయిన నీవు స్వర్గసామ్రాజ్యమునకు ఏల పోవలయును?'

క్రై;-'స్లీవపై మరణించిన మనప్రభువు నచ్చట చూచుటకు. అచ్చట మృత్యువునకు తావు లేదు. పరమ పితను కీర్తించు స్తుతిపాటకులతో గూడి సదా పరిశుద్ధులు పరిశుద్ధులు అనుచు సంగీతమున లీలమై పోవుటకు నే నచ్చటకు బోవ దలంచెదను.'

ధర్మావతి;-'అయ్యో! నీవు వివాహవంతుడ నంటివి గదా, నీభార్యబిడ్డలు ఎట్లున్నారు.

క్రై;-'వారెట్లున్నారో అట్లేయున్నారు. అంతకన్నను వారినిగూర్చి నే నేమియు చెప్పజాలను.'

ధ. వ.;-'మరి నీతో వారినేల తీసికొని వచ్చితివి గావు?,

క్రై;-'మహానందముతో దీసికొని వచ్చెడివాడను. కాని నాభార్యాపుత్రులు నాయీ యాత్ర కిచ్చగింప లేదు.?'

ధర్మావతి;-'నీవు వారలను అనునయించి అచ్చటి అపాయమును వ్యక్తము జేయవైతివా?'

క్రై;-'నాశక్తికొలది ప్రయత్నించితిని కాని నా ప్రయత్న మంతయు వమ్మయినది. పైగా వారు నన్నొక ఉన్మత్తునిగా భావించిరి.'

ధ, వ.;-'నీవెంట వచ్చుటకు వారేల సమ్మతింప లేదో.?'

క్రై;-'నాభార్య ఈయాత్రమూలమున తానున్న ఈ ప్రపంచమునే వదలుకొన వలెనేమోనని భయ పడినది. మరి నా పుత్రులు బాల్యచాపల్యము వలన తల్లిని విడిచి రామనిరి.

ఇట్లే మరికొంత కాలము వారేవేవో ముచ్చట లాడుచుండుట స్వప్నమున గాంచితిని. అంతలో పరిచారి కలు హెచ్చరింప, వారెల్లను భోజన శాలకు పోయిరి. అందు షడ్రస శాక సూపాది వివిధ భక్ష్యములు ద్రాక్షరసాది వివిధ పానీయములు ఫలములు ఇంకను ఏవేవో సిద్ధముగా నున్నవి. వారొక నిమేషకాలము భగవంతుని స్తుతిపూర్వ కముగా జపించి, భోజనమున కుపక్రమించిరి. ఆ సమయ మున నాగకన్యకలు ఆ పర్వత స్వామి పరాక్రమమును ఉదాత్తత్వమును దయామయత్వమును వర్ణించి చెప్పుచుండ

క్రైస్తవుడు మిక్కిలి మక్కువతో నాలకించెను. భోజనానంతర మాతనిని సౌధాగ్ర భాగమున విశ్రమింప జేసిరి. నాటిరేయి క్రైస్తవుడు హాయిగా నిద్రించెను. అంత ప్రభాత మగుటయు నతడు మేల్కొని "యాత్రికులకీ క్రియ మేలు గావించు పరలోక స్వామిని స్వర్గ కాంతు నదా ప్రస్తుతించెదన"నుచు ప్రార్థన గావించెను.

ఆ యుదయ మా కన్యకలు క్రైస్తవుని నానావిధములైన వ్రాత పుస్తకములున్న గదిలోనికి దీసికొనిపోయిరి. ఆ పుస్తకము లందంతటను ఆ పర్వత స్వామి చరిత్ర వర్ణింపబడి యుండెను. యాత్రికుల కోసమై ఆ ప్రదేశము జయించుటకు ఎన్ని యుద్ధములు జేయబడెనో, ఎందరు శత్రువులు సంహారింపబడిరో ఎంతకాలము పోరాటము జరిగెనో— ఆ సమాచారము లన్నియు నట విశదముగా వ్రాసియుంచిరి. మరియొక గదిలో కత్తులు, కటారులు, బల్లెములు, బాకులు మొదలుగా గల ఆయుధములన్నియు సిద్ధముగా నుంచబడినవి క్రైస్తవుడా ప్రక్క గదిలో ప్రవేశింప, నందు సాముసోనుడు శత్రువులను రూపుమాపిన గాడిద తల యెముక, దావీదురాజు గొలియాతుని చంపిన వొడిసెల, యింక నవేవో వస్తువులున్నట్లు కలలో గాంచితిని. అంతట క్రైస్తవుడు ప్రయాణ మగుచుండుట గమనించి, యా కన్యకలు ఈనాటి కిందుండుము; రేపు వెళ్ళవచ్చు నని నిలిపిరి.

వారు క్రైస్తవుని సౌధాగ్రమునకు దీసికొనిపోయి, చేయెత్తి దూరముగా జూపిరి.

అదియొక కొండ. అచ్చట చెట్లు దట్టముగా పెరిగి చల్లని నీడ నిచ్చుచున్నవి. చిగురుటాకులు, పువ్వులు, ఫల-

ములు పుష్కలముగ చెట్లనిండ నిండియున్నవి. ఆ చెట్లలో వివిధ వర్ణములుగల నేత్రానంద మొనర్చు పక్షులు ఎలుగెత్తి మనోహరముగా గానము చేయుచు, శ్రవణానంద మొనర్చుచున్నవి. అందలి మంచినీటి చలములలో తియని నీరు నిరంతరము పారుచున్నది. ఇన్ని సౌకర్యములుండుటచే ఆకొండ ఆహ్లాద నగమను పేరిట నొప్పియుండెను. ఆ పర్వతము నెక్కి చూచినచో, స్వర్గ సామ్రాజ్యపు కవాటము కూడ కాన్పించును. యాత్రికుడు ఆ పర్వతమును జూడ నిచ్ఛగించుచు, రక్షణార్థమై కత్తి నొకదానిని చేతబట్టుకొని నడచిపోయెను. వివేకవతి ధర్మావతి మొదలుగాగల గృహ కన్యకలను బహిర్ ద్వారము వరకు క్రైస్తవుని సాగనంపుచు, పండ్లు, రొట్టెలు, రసము మొదలగు భోజనపదార్థములొసంగిరి. అతడును ఉచితరీతిని వారిని వీడ్కొని ముందునకు సాగి పోయెను.

గుబురైన చెట్లచే చీకటులు గ్రమ్మిన లోయగుండ మార్గము. ఆ లోయలో క్రైస్తవునకు మహా విపత్తు ప్రారంభించినది. ఆ భయంకర ప్రదేశములో పెద్దకాలము నుండి భేతాళు డొక్కడు నివసించు, పిశాచ ప్రేరితుడై ఆ దారిని బోవు యాత్రికులను బట్టి హింసించుచుండును. వాడును క్రైస్తవుని దవ్వు దవ్వులనే పరికించి, పండ్లు పటపట గొరుకుచు, అట్టహాసముతో రౌద్ర మూర్తియై ఆర్భటించుచు, మార్గమునకు అడ్డముగా వచ్చి నిలుచుండెను. వాని కెగురుట కనువుగా రెక్కలును మనుష్యులను చీల్చి వేయుట కనువుగా కాలికి మొనదేలిన గోళ్ళును గలవు. వాడప్పుడు సింహమువలె నోరు దెరచుచుండెను. ఆనోటిలో

శాకులవలె కోరలు మెఱయు చుండెను. జఠరము నుండి ధూమమును అగ్నియును బయుట కుద్భూత మగుచుండెను. వాని దేహము చేప వలె పొలుసును పామునకు వలె కుబుసమును కప్పియుండెను. వాని కన్నులు తప్పద్రాగిన వాని నేత్రములట్లు ఎఱ్ఱబడి యుండెను. వాని నోటినుండి కుక్క నాలుకవలె పెద్దనాలుక బయటకు వ్రేలాడుచుండెను. దానిని వాడే అప్పుడప్పుడు కొరకు కొనుచు, బాధపడుచు ముఖమును చిట్లించుకొనుచు, కనుబొమ్మలు వికృతముగా ముడిపడునట్లు జేయుచు, నల్లత్రాచువలె బుసగొట్టుచుండెను. వానిమూతికి రెక్కలకు రక్త మాంసము లంటుకొని యున్నవి. అప్పుడే ఏదో జంతువును చీల్చి రక్తమును త్రావి వచ్చినట్లున్నది. అట్టి భయంకర మూర్తిని భేతాళుని గాంచి, యాత్రికుడు నివ్వెరపడ కెవ్వన కేకవైచెను. వెనుకకు పారిపోవ దలంచెను. కాని అడుగు వెనుకకు బడలేదు. ముందున కంత కంటెను లేదు. "ఆపదలందు ధైర్యము" అన్నమాట జ్ఞప్తికి దెచ్చుకొని, గుండె రాయి చేసికొని క్రైస్తవుడు నిలుచుండెను. అంతట భేతాళుడు సమీపమునకు వచ్చి చెవులు చిల్లులు బడునట్లు పెద్ద ధ్వనితో నిట్లనెను.

భేతా:- 'ఓరీ నీవెచ్చటనుండి యెచ్చటికి బోవుచుంటివి?'

క్రై:- 'వినాశకమను పేరిటి పట్టణమునుండి స్వర్గ సామ్రాజ్యమునకు బోవుచుంటిని.'

భే:- అరరే దుర్మార్గుడా ఏమంటివి? వినాశకమను పట్టణమును వదలి పోవుచుంటి నంటివా? ఆ ప్రదేశమునకు ప్రభువైన ఈ భేతాళు నెరుంగవా? నా యాజ్ఞలేకయే

సామ్రాజ్యమును త్యజించి పోవుచుంటివా? అయిన నే మూనమె, నిన్నిప్పుడే శిక్షించి భక్షించెదను.'

క్రై :- 'నేను నీ దేశమున నుద్భవించిన మాట నిజమే. కాని నీ కొలువు మహా దుర్భరము. నీవును పరమ దుర్మార్గుడవు. అట్టి నీపట్టణములో మముబోటి సాధు జనులకు నిలువ నీడలేదు.'

భే :_ 'ఓరీ యాత్రికాధమా! నా సమక్షమున నే నన్నధిక్షేపించు చుంటివా? పొగరుబోతా పాలకునకు పాలితులపై పరిపూర్ణాధికార మున్నదని నీవెరుంగవటరా దుర్మతీ? అయినను నీమేలుగోరి చెప్పెదను. వెనుకకు తిరిగి శీఘ్రమే నా పట్టణమునకు నడిచి పొమ్ము.'

క్రై :- 'నేను వెనుకకు తిరిగి పోవుటకు రాలేదు. రాజాధి రాజైన జగత్ సార్వభౌముని దర్శింప నేగుచుంటిని.'

భే: - ఔరా ఏమి నీకండ కావరము, ఎట్టెట్టు ప్రభువులకు ప్రభువైన బెల్జబూబునిచే ప్రభుత్వమును విభుత్వమును గాంచిన ఈ భేతాళ సార్వభౌముడుండ, మనుష్యాధమా! వృధా మంగళ పాఠక! వేరొక్కని ప్రభువని నా సమక్షమున నిర్భయముగా స్తుతించెదవా?

నా ప్రతాపము నెరుంగక నీవిట్లు బేలవై పల్కెదవు గాక. కాకున్న నేమి? కుట్టినం దేలందురు. కుట్టకున్నం దాని నే కుమ్మరపురు వందురు. ఇదే యుద్ధమునకు సన్నద్ధుడవుగమ్ము. నేటితో నీ జీవితపు పొద్దు పడమటకు జరిగి అస్తమింప నున్నది. దెబ్బ కాచుకొమ్ము — అనుచు భేతాళు

జొక్క యగ్నిశూలమును క్రైస్తవునిపై విసరెను. కాని యాత్రికుడు తనచేతనున్న డాలుచే దాని నుపసంహరించెను. అందుల కెంతయుంగోపించి, భేతాళుడాతనిపై బాణవర్షము గురిపించెను. కాళ్లు, చేతులు, తల రొమ్ము - ఇంతయేల అతని కాయమంతయు గాయముల మయమయ్యెను. అట్టి స్థితిలో క్రైస్తవుడు ధైర్యము చెడి దిక్కుమాలి దీనుడై వెనుకంజ వేయ మొదలిడెను. కాని తన యోపినంతమట్టుకు డాలుతో భేతాళుని బాణములనుండి తప్పుకొనుచు, బాకుతో నప్పు డప్పుడు వానిని జడిపించుచునే యుండెను. కాని గొర్రెపిల్ల లెక్కడ తోడేలు నెదురించుట యెక్కడ? క్రైస్తవుని యోటమిని గ్రహించి భేతాళుడు మరింత విజృంభించి పైనబడెను. అతనని పిడికిటి పోటులచే నొప్పించి ఒక్కచరుపు జరువ యాత్రికుని ఖడ్గ మల్లంత దూరములో బడెను. భేతాళుడుప్పొంగి ఇంక నీకేదిదిక్కు రాగమ్మనుచు క్రైస్త వుని బట్టుకొనెను. అతడును మహా కష్టముతో తన కత్తిబడిన చోటు వరకును భేతాళుని యీడ్చుకొని పోయెను. వాడు పర్వతములు మారుమోగునట్లు గర్జించి, వికటాట్టహాసము చేయుచు తన దేహము నిబ్బడిగా బెంచి, భయంకర మూర్తియై, నా విజయమును నీ చావును నిక్కము సుమీ యనుచు క్రైస్తవునిపై విసరుటకు పెద్దబండ నెత్తుకొనెను. ఆ దెబ్బతో నతడు పేలపిండివలె పచ్చడివలె పిసురై పోవలసినదే! కాని దైవానుగ్రహ మాతనియందు సంపూర్ణముగా నుండుటం జేసి, భేతాళుడు బండ విసరునంతలో కుడిచేత తన ఖడ్గము నందుకొని దైవబలము తనలో ప్రసరించిన నావేశ పూరి తుడై తన్ను తాసెరుంగక భుజము సారించి హుంకరించి వైరి

లంఘించి భేతాళుని నోనటిపై లక్ష్యముంచి, గట్టిగా గొట్టెను. అద్దిరా దెబ్బ! దానితో భేతాళుడు దిద్దరం దిరిగి, కన్నుల భ్రమలు గ్రమ్మచుండ నిలుచుండ జాలక సొరుగుచు, యుద్ధ భూమిలో కుంభస్థలము పగిలిన యేనుగువలె వెల్లనై వెను మొగము పెట్టెను. వాని చేతిలోని రాయి అచ్చటనే జారి పడెను. క్రైస్తవుడది గమనించి సాహస ధైర్య స్థైర్యముల నెంతయు విజృంభించి, భేతాళుని రెండవ దెబ్బ చరుచుటయు వాడు గండభేరుండ పక్షివలె రెక్కలూపుచు గొల్లభామ పురుగువలె ఉయ్యాలలూగు నడకలతో దెబ్బతిన్న జెర్రివలె చేతికి జిక్కకుండ పారిపోయెను. చదువరీ! ఒక్కమాట. ఆ భేతాళుని భయంకర స్వరూపము, వాని విజృంభణము, స్వప్నమున గాంచుచున్న నాకే భయమును గొల్పినది. మరి గడగడ వణకుచున్న క్రైస్తవుని దీనావస్థ నేమని వర్ణింపను. అతడీ మహా యుద్ధములో గెలుచునని మీరే గాదు, నేనుకూడ ననుకొనలేదు. కాని అది దైవానుగ్రహము. తన్ను నమ్మినవారిని దైవ మెన్నడును చేయి విడువ డనుటకిది ప్రబల సాక్ష్యము. ఇక కథ వినుడు:—

అట్లు భేతాళుని బారిదప్పి బ్రతికిన క్రైస్తవుడు పులి నోటినుండి జారిపడి పరుగెత్తిన కుందేలువలె గ్రద్ద కాళ్ళ నుండి తప్పి క్రిందబడిన కోడిపిల్లవలె గడగడ వణికి కొంత సేపటికి తెప్పరిల్లి తన్నుతా నెరింగి యబ్బుర పడసాగెను. అంతయును భగవంతుని దయయన ఆ దయామయుని నుతించుచు, భక్తిరసము వెల్లువలై పార నిట్లు స్తుతించెను. "సైతానుడైన బెల్జబూబు దుర్బుద్ధియై మదభ్యుదయమున కీర్ష్యా పరవశుడై భేతాళుననుప వానికి నాపై నివ్వనభూమి

లసత్స మరోత్సవ మయ్యెను. అయ్యెడ దయామయుడును అనాథ సనాథుడగు దేవుడంప మహాబలుడు మిఖయేలు సన్నద్ధుడు వచ్చెను. వచ్చిన నాతని దివ్య తేజము నాతనువు సొచ్చెను. చొచ్చిన తద్వైరోధి పృథురుధిర ధారలు కంట గంటిని. మంటిని. సుఖముండ చంటిని. అమ్మహాదేవు దివ్యనామము సంస్తుతి కెక్కఁగాక.

అప్పుడొక హస్తము జీవిత వృక్షపు టాకున నందింప క్రైస్తవు డందుకొని గాయములపై కట్టుగట్టెను. వెంటనే గాయములన్నియు మానిపోయెను. అతడెక్కువగా నలసిన వాడగుటంచేసి మున్ను తనకు కన్యకలిచ్చిన పదార్థముల నొకచో గూర్చుండి భుజించి పరిశ్రాంతినుండి విశ్రాంతి నొందెను. అంత గమనోన్ముఖుడై అపాయమునకు వెరచి కత్తి చేతబూని సాగిపోయెను. కాని యీమారు శత్రువు లెవ్వరును తన్నెదుర్కొనలేదు. అతడట్లు పోవుచు మృత్యుచ్ఛాయ యనబడు లోయలోకి వచ్చెను. అది నిర్మానుష్యమై వన్య మృగలకు నిలయమై యుండెను. ఎంతటి ధీరులోగాని యొంటరిగా ఆ లోయలో నడిచిపోజాలరు.

అట్లు కలగాంచుచున్న నేను ఇరువురు క్రొత్తవ్యక్తులు క్రైస్తవుని సమీపించుట జూచితిని. వారాత్రముతో మరలి పొమ్ము మరలిపొమ్మని అరచిరి. ఇప్పుడింత ప్రళయమేమి వచ్చినదని క్రైస్తవుడన, "ఓయీ మేమొకింత ముందున కేగియున్న పక్షమున నీకీవార్తను చెప్ప దిక్కుకూడా యుండెడిది కాదు. ఏమందువా కార్యార్థులమై పోవు మేము కొంతదూరము నడచి చూతుముగదా, భీకరమైన చీకటులు మార్గమైనను గన్పించుటలేదు. ఆ చీకటిలో పులులు సింహా

ములు దయ్యములు భూతములు - ఓ ఒక్కటేమిటి ప్రాణ
ముపై ఆశయున్నవాడు అడుగటు పెట్టడు సుమీ! అనిరి.
క్రైస్తవుడును 'ఔగాక' నా మార్గ మిదియే కష్టమార్గము
ననేకదా సుఖమును బొందుట, అనుచు కత్తిని జళిపించుచు
ముందునకు బోయెను. ఆ దారికొక వైపున పెద్ద గోయి
వేరొక వైపున పెద్ద యుబ్బలి ఆ గోతిలో నిదివరకే గ్రుడ్డి
వాడు గ్రుడ్డివానికి దారిచూపినట్లు అనేకులు పడిపోయిరి.
మరి యా యూబిగుంటలో నుండొకసారి దావీదురాజే
కాలుజారి పడెను. కాని దైవమతనిని వెంటనే యుద్ధరించెను.
పోనుపోను మార్గ మిరుకైనది. పరిసరములా చీకటిమయము.
కాలిటుజారినను అటుజారినను మరి క్రైస్తవుడు మనకు
దక్కడుగదా' యని నేను శ్రద్ధగా గమనించుచుంటిని.
అక్కడ నొకచోట మార్గమున అగ్నిగుండముల భీషణ
ధ్వనులు హృదయమును బ్రద్దలు చేయుచున్నవి. యాత్రికు
డచ్చోట భీతిజెంది "ఓ ప్రభూ నన్నను గ్రహింపుడ"ని
ఎలుంగెత్తి పలుకుట వింటిని. అట్లు నడుచు నప్పుడు
చాల దూరమువరకు సెగలు పొగలు ప్రతిధ్వనులు బాధిం
చినవి. భూతములు వెంబడించినవి, కాని దైవబలము నన్నుద్ధ
రించుగాక అనుచు తదేకదీక్షతో నతడు నడిచిపోయెను.
ఎంతటి ధైర్యవంతుడో గదా! ఒక్కమాట మరచితిని.
యాత్రికులకామార్గమున తనశబ్దమేదియో, పరుల శబ్దమేది
యో గుర్తింపజాలనంతటి గందరగోళము జరిగినది. ఆసమయ
మున కొన్ని దేవదూషణములు వినవచ్చినవి. అవి తానే ఉచ్చ
రించితి నేమోనని క్రైస్తవుడు భయపడెను. కాని తా నసమ్మి
సర్వేశ్వరుని క్రైస్తవుడట్లు నిష్కారణముగా తూలనాడునా?

ఆ భూతములే దేవదూషణలు పల్కి, క్రైస్తవునకా భ్రాంతిని కలిగించి యుండనోపు.

ఆ లోయ చివరకు వచ్చినపుడు తెల్లవార వచ్చినది. అంతలో క్రైస్తవునకు ముందు భాగమున "ఒంటరిగాడ నైన నేమి దైవ కటాక్షము నాయందున్నది. శత్రువులు నన్నేమి చేయజాలరు" అన్న పల్కులు వినవచ్చినవి. అతనికి ఉత్సాహ మతిశయించినది. అంతలో సూర్యోదయ మైనది. చీకటు లంతరించినవి. కాంతులతిశయించినవి. పరమాత్ముని వెలుగుతో చీకటిని దాటిపోదుననుచు, క్రైస్తవు డరుగుచుండెను. అది లోయ కొన. అచ్చట మనుష్యుల ఎముకలు తల పుర్రెలు దారిపైన మరికొన్ని వస్తువులు గుట్టలు గుట్టలుగా బడియుండెను. అచ్చటనే నొక కొండ బిలమున్నది. పూర్వమందు రక్తాక్షుడను రాక్షసు డుండువాడట. వాడా దారినిబోవు యాత్రికులను బంధించి సంహరించుచుండువాడట. ఈ ఎముకలన్నియు పాపము వారివే! అయితే, ఆ రాక్షసుడు చాలా కాలము క్రితమే చచ్చిన వాడగుట, ఈ యాత్రికుడు సులభముగా నా చోటుదాటి పోయెను.

అట్లుదాటిపోవుచు తనముందు పోవుచున్న విశ్వాసుడను వానిని చూచి 'ఓయీ! నేనును వచ్చుచుంటిని. కొంచెము నిలువు' మనెను. కాని యతడు నిలువకే 'శీఘ్రముగా బోవలెను' రా రమ్మనెను. వెనుకటి వాడు ముందువాడయ్యె నన్నట్లుగా, నిత డతనిని తొలగ ద్రోచి పరుగెత్తి ఆయాసముతో చతికిల బడెను. ఆ మిత్రుడును యాత్రికుని పైకి లేపుచు నడువ మని హెచ్చరించెను. వారిట్లు సంభాషించిరి.

కైః- 'అన్నా! దైవము నిన్ను నాకు, నన్ను నీకును అనుగ్రహించెను. సుహృద్బుద్ధితో నడిచి పోవుదము.

విశ్వా:-'మంచిది వినాశక పట్టణము నుండి నేను నీతో గలసి రావలసినది. కాని నేను బయలు దేరు నప్పటికి నీవు బయలు దేరి చాలకాల మైనది.

కైః- 'నా వచ్చిన వెనుక నీవా పట్టణమున ఎంత కాలముంటివి?

విః- ఆ, ఇది మీాదట నాపట్టణమున నుండ జాలమను నంత వరకు నచట నే యుంటిని.

నీ చనిన వెనుక ఆపట్టణ మనతి కాలములో అగ్నిచే దగ్ధ మగునని ప్రజలెల్లరును చెప్పుకొను చున్నారు.

కైః;- ఔగాక! మరి నీ వొక్కడవే వచ్చితివా వారేమి చేయు చున్నారు.

విః- అదే వింతలలో వింత. అందరును చెప్పుకొను వారే. అందరును విననట్లుండు వారే. అందరును చూచు వారే. అందరును చూడనట్లుండు వారే. అందరును తెలిసిన వారే. అందరు తెలియని వారే. అతి విచిత్రము గదా ప్రపంచ ప్రకృతి!

కైః- పోనిమ్ము. మంద బుద్ధియను వాడొకడు మొదట మాతో వచ్చెను. అతడే మయ్యెను.

విః- మన యూర నే యున్నాడు. పాప మతని నందరు మగవాని వలె పోయి మధ్యే మార్గమున మరలి వచ్చిన ధీరుడని పరిహాసించు చున్నారు. మొగమెత్తుకొని

పది మందిలో దిరుగుట కతనికి చిన్నతనముగా నున్నది. మొన్న వీథిలో నాకెదురు పడి, తప్పుచేసిన వానివలె తల వంచుకొని ప్రక్కగా దొలగి పోయినాడు. అట్టివారి నెట్లు పలకరింప మందువు?

క్రై:- పోనిమ్ము వారితో మనకేమి. నీవు మాత్రము మార్గములోని అపాయములన్నియు ఉపాయముతో దప్పించుకొని నిరపాయముగా వచ్చినట్లున్నావే?

విశ్వా:- దారిలో కామ కాళిని యను కామినీ పిశాచము నన్ను చాల బాధించినది.

క్రై:- పూర్వ మది జోజేపుని గూడ వలలో వేయ జూచినది. దైవానుగ్రహముచే నాతడా యుచ్చులో దగుల్కొనలేదు.

విశ్వా:- అది నీకు కావలసిన సుఖము నంతయు నేనీయ గలను. నా వెంట రమ్మని బలవంతము చేసినది. దాని పలుకులు, కులుకులు, చూపులు, రూపులు, నవ్వులు, గివ్వులు నన్ను ఒకింత వికార పరచినవి. కాని మున్నొక మహాత్ముడు ఆరొయ్య మీసాల మీది తేనెలు, ఇట్టి తుచ్ఛ సుఖములు నీకేలయని వ్రాసిన వ్రాత జ్ఞప్తికి వచ్చినది. తల్లీ నీకొక దండము. నన్ను వేదింపకు మని చెవులలో వ్రేళ్ళుంచుకొని కన్నులు మూసికొని పరుగెత్తి దాని పీడ వదలించుకొంటిని.

క్రై:- మరేమియు నుపద్రవములు నీ మార్గమున లేవా?

విశ్వా:- లేకేమి? కష్టపు కొండ యంచున నొక మహానుభావుడు తోడైనాడు. వాడు వయసు చేత పెద్ద

వాడు. టక్కరి తనముచేత అంతకన్నను పెద్దవాడు. నన్ను జూచి ఓయీ! మా యూరీ సమీపముననే యున్నది. దాని పేరు మోసగాని ప్రోలు. నీవు మాయింటికి వచ్చి సుఖముగా నుండవచ్చును. నాకు ముగ్గురు కూతు లున్నారు. వారివి పురుష కామిని, రూపకామిని, రతి కామిని యని ముచ్చటైన పేళ్ళు! నీవా మూవురిని పరిణయమై నాయనంతరము నా ఆస్తినంతను అనుభవింప వచ్చును. ఇంతకన్నను వేరొక చోట నీవు పాముకొనునది మాత్ర మేమున్నది కనుక? రమ్ము పోవుద మనెను. ఔరా ఎంతటి అదృష్టమని నేనుబ్బిపోయి వాని ముఖము వైపు జూతును కదా "వీనిని నమ్మి మోసపోకుడు" అని చిన్న అక్షరములతో వాని నొసటిపై వ్రాయ బడి యున్నది. ఔరా వీడెట్టి దుర్బుద్ధి! నన్ను ఒక బానిసగా నమ్ముకొని ధనము గడించుటకై పన్నిన పన్నాగ మిది గాబోలని కోపము నణచ యుంచి, 'పోవయ్యా పెద్దమనిషి బుద్ధిలేదు. సరిసరి సుద్దులు చెప్పెదవేల!' అని కసురు కొంటిని. వాడును తన లోపము నెరింగితినని సిగ్గుపడి గొర్రెవలె తలవంచుకొని మెల్లగా దాటిపోయెను. పోరా దౌర్భాగ్యుడా యని నేనును నడిచి వచ్చితిని.

క్రై:- ఇంకేమైన విశేషములు కలవా?

విశ్వా:- తాలుము. ఆసంగతి పూర్తిగా చెప్పలేదు. అంతట నా పర్వత మెక్కి యొక ఇసుక తిన్నెపై లతా మంటపము నొకదానిని గాంచితిని.

క్రై:- అవు నవును. అచ్చటనే నా శ్రీ ముఖము పోగొట్టుకొంటిని.

విశ్వా:- అచ్చట నొక మనుష్యుడు బెత్తముతో నన్ను చావ మోదినాడు. అయ్యా! చచ్చు చున్నాను. దయ జూపవే మహాత్మా యని వాని పాదములపై బడితిని. "అదేమిటి దయా ఆమాట నేనెప్పుడును వినలేదే" అనుచు నాతడు మరిమరి చావమోదినాడు. ఆ కటినాత్ము డెవ్వడో దయయను మాటనే ఎరుంగడట.

శ్రీ:- అతడు మోయీజుడు సుమా! తన యాజ్ఞ నుల్లంఘించు వారిని అతడట్లే శిక్షించును.

ఇట్లు సంభాషించుచు వారు నడచి పోవుచుండ ఆబాను బాహువుడు దృఢ కాయుడునైన పురుషు డొక్కడు వారి ప్రక్కగా నడచుట కలలో చూచితిని వాని పేరు వదరబోతు. విశ్వాసుడు వానిని పలుకరించెను.

విశ్వా:-'అయ్యా నీవెచ్చటికి వెళ్లుచున్నావు?'
వదరుబోతు:- 'స్వర్గ సామ్రాజ్యమునకు'
విశ్వా;-'మేమును అచ్చటికే బోవుచుంటిమి.

వద:-'అట్లయిన త్వరగా నడువుడు. అందరము కలసియే పోవుదము. ఊరక బోవనేల మనమేమి మూగివారలము గనుకనా! ఏదైన నొక మంచి విషయమునుగూర్చి మాట్లాడుదము. ప్రపంచములోని ప్రజలు వారికనవసరములైన విషయములనుగూర్చి వదరుచు కాలమును వ్యర్థపుచ్చుదురు అది నాకు సుతరాము గిట్టదు.'

విశ్వా:-'అది బుద్ధిమంతుల లక్షణము. కానిమ్ము మంచినిగూర్చి ముచ్చటించుద మంటివి. దేవునికన్నను మంచి యేమున్నది. కావున భగవత్సంబంధమైన విషయములు ప్రస్తావించెద గాక.'

వదరు:-'మంచిది ఆవిషయ మేదో మొదలు పెట్టుము.'

విశ్వా:-'కాదు కాదు నీవే ప్రారంభింపుము. దేనిని గూర్చి యారంభించెదవో చూతము.'

వదరు:-'దేనినిగూర్చి యందువా? చెప్పెదను వినుము, స్వర్గ విషయములా, లోక విషయములా, న్యాయ విషయములా, వేద విషయములా, భూతభవిష్య ద్వర్త మాన విషయములా, బహిరంత ర్దేశ విషయములా, అత్య వసర విషయములా, అనవసర విషయములా, ఓ! ఒక్క టేమిటి ఈ విషయమున నే నెరుంగని విషయములే లేవని నీ వెరుంగుట మేలు!'

ఆతని ఈ వాగాడంబరమునకు విశ్వాసు డదరి పడి 'అహో! యితడెంతటి పండితుడో చూచితివా' యని, క్రైస్తవునితో ననెను. అతడును మెల్లగా 'వీడు పరమ శుంఠ. తన్నెరుంగని వారి పట్ల నిట్లే వాచాలుడై ప్రేలుచుండును.'

విశ్వా:-'అట్లయిన నీ వీతనిని ఎరుంగుదువా యేమి?

క్రై:-'నేను వీని నెరిగినంతగా వీడు వీనినే ఎరుగడు. నేగాకున్న నీవుమాత్ర మెరుంగవా ఏమి? వీడు మన నగ రములోని అనద్భాషి కుమారుడు. వీడు చెప్పిన వేద విష యములు వీని హృదయములో నేవియు లేవు. నాలుకనుండి మాత్రము దొర్లుచుండును. అని క్రైస్తవుడన విశ్వాసు డక్కజపడెను. అతడు వదరు బోతును మెల్లగా వివాదము లోనికి దించెను. కాని వదరుబోతు వాదములో మూడు మాటలు ఆరు తప్పులు. అంత విశ్వాసు డాతనిని మంద లించి, అయ్యా! నీవాదము సరికాదు. అనలీమాటలు నీ

హృదయమునుండి పుట్టినవా లేక నాలుకనుండి ఊడిపడి నవా యని కల్ల కపటము లేకుండ నడిగి వైచెను. దాని కావదరుబోతు ఎంతయు కోపించి, ఔను తేవోయి! బుద్ధి మంతునియట్లు మాట్లాడు చున్నావు. నీ బుద్ధి నిన్నుద్ధరించు గాక. పో పొమ్మని వైదొలగి పోయెను. క్రైస్తవుడు చూచి తివా వీని మహాత్మ్యమనుచు అతనిని హెచ్చరించుచు బోవు చుండెను.

అట్లు బోవుచుండ మార్గములో సువిశేషకారుడు వారిని కలసికొనెను. "ఓహో మీ కిదే సమాధాన మగు గాక" అనెను. యాత్రికు లతనికి స్వాగతము పల్కి, తమ కష్ట సుఖములను ఆతనితో జెప్పుకొనిరి. దేవదూత వారిని ఘస్తరించి దేవునిపై నమ్మకముంచి మంచి మనస్సుతో మీ కష్టములను సహింపుడు. ఇటుపైని మీ కింతకన్నను కష్టములు రానున్నవి. జాగరూకతతో పైనము గండు. దైవము మిమ్ముద్ధరించుగాక! యనుచు మరుగైపోయెను. యాత్రికులును నడిచి పోయిపోయి డాంబికపురమను పట్టణమును సమీపించిరి. ఆ పట్టణమునకు డాంబిక ద్వయమను వారు అధిపతులై యుండిరి. పెక్కేండ్ల నుండియు యాత్రికులు మోక్ష సామ్రాజ్యమున కేగుట జూచి, కన్ను కుట్టిన బెల్జబూబు, భేతాళుడు మొదలుగాగల దుష్టసైతానులందరును గూడి ఈ పట్టణమును నిర్మించి, దాని కధిపతులనుగా నీ డాంబిక ద్వయమును నియమించిరి. డంబమునకాయూరు పుట్టినిల్లగుట, అందలి వారందరును డంభముతో పుట్టి, దానిలో బెరిగి దానిలోనే నశింతురు. ఆ డాంబికులకు తాగుట, తందనాలాడుట, జూద మాడుట, తిట్టు

కొనుట, కొట్టుకొనుట నిత్య కృత్యములు. వారెల్లరు మోసగాండ్రు, వ్యభిచారులు, దొంగలు, తార్పుడు గాండ్రు, త్రాగుబోతులు, మదించిన ఆబోతులు, మూర్ఖులు, దుర్మార్గులు, శుంఠలు. ఇట్టి పాపాత్ములు తమ్ము సేవింప, నా డాంబిక ద్వయము పిశాచ ప్రేరితమై మధ్యాహ్నపు సూర్యునివలె మిడిసిపడుచు ఆ పట్టణమును ఏలుచుండెను.

మన యాత్రికులును మార్గమున నున్నదగుటచే ఆ పట్టణములోనుండి పోవుచుండిరి. ఆయూరి ప్రజలందరు వీరిని వింతగా జూచుచు "ఓహోహో వీరెవరయ్యా వింత దుస్తులతో ఊరేగుచున్నారే! యని గేలి చేసిరి. యాత్రికులు ఆ యూరివారిని పలుకరించి మాట్లాడిరి. కాని వారి భాషలు భిన్న భిన్నము లగుటచే అర్థ మనర్థమైనది. అంత నా యూరివారు వీరిని హేళన జేయుచు 'ఔరా! దురాత్ములు! పైశాచి ప్రాకృతులు మాట్లాడుచున్నార'నిరి. అట్లనుచు నా ప్రజలందు గుమిగూడి యాత్రికులను చుట్టు ముట్టిరి. కలవర పెట్టిరి. కేకలిడిరి. అదియేమని డాంబిక ద్వయము డుగ, నెవ్వరో క్రొత్తవారు యాత్రికులట. స్వర్గ సామ్రాజ్యమునకు వెళ్ళుచున్నారట అనివారనిరి. అప్పుడా డాంబికులు ఉగ్రులై 'అర కేత్ర్వ్రష్టులారా! ఏ భ్రాసి వెధవలారా! మన మిచ్చట నున్న దెందుకు? అట్టివారిని పరాభూతులను జేసి విఘ్నము గావించుటయే గదా! మన పని. ఇంకను చూచెద రేల. పట్టుడు పట్టుడ'నుచు అర్భటించిరి. వెంటనే వారందరు గుంపుగూడి యాత్రికులను బంధించి వారిని న్యాయస్థానమునకు గొంపోయిరి. అచ్చట నొక బల్లపై "అన్యాయస్థానము. అన్యాయవాదులు వర్ధిల్లుదురుగాక!"!

అని మసిబొగ్గుతో వ్రాయబడి యున్నది. అంత వారి న్యాయవాదులు వచ్చి వీరి వాక్యములు వినకముందే వీరు మహా ద్రోహులు. ప్రపంచమునే నాశనము చేయగల దుష్టాత్ములు, దుష్ట చరిత్రులు. కావున మరణ దండనకు వీ రర్హులు" అని తీర్పుచెప్పిరి. వెంటనే యాత్రికులను మృగములవలె బోనులలో బిగించిరి. అందుంచి వారిని నానా విధములైన హింసలను బెట్టిరి. కొందరు బంతినట్లు తన్నిరి. కొందరు వేటమృగములట్లు పొడిచిరి. ఇంకకొందరు బయలు నట్లుమిసిరి. మరికొందరు ఉన్మత్తునట్లు అపహాసించిరి. ఇట్టి బాధలకు జిక్కి దిక్కుమాలి యాత్రికులు కండ్లవెంట నీరు గార్చిరి. ఏడ్చిరి. ఎలుగెత్తి కేకలువైచిరి. ఎగిరిపడిరి. దుఃఖము పెల్లుబక నోట మాటరాక జీవితముపై ఆశ విడనాడి నిశ్చేష్టులై పడిపోయిరి. రాత్రికూడ వారిని కాళ్ళు చేతులు బంధించి బోనులయందే పడవైచిరి.

ఆ మరునాడు వారి న్యాయస్థానములో వీరిని మరలా ప్రవేశపెట్టిరి. ఆ న్యాయమూర్తి పేరు ద్వేషబుద్ధి. వారి పక్ష న్యాయవాది అసూయాగ్రేసరుడు అనువాడు లేచి ద్వేషబుద్ధికి నమస్కరించి ప్రభువైన బెల్జబూబు నుద్దేశించి అన్యతము బాహాటముగా నుగ్గడించు చున్నను యాత్రికులను పేరిటి ఈ గోముఖ వ్యాఘ్రములు మన పట్టణపు శాంతిని భంగపరచిరి. మన వ్యాపారమునకు క్షతి గల్గించిరి. మన ప్రభువునకు అనభ్యుదయము నుద్దేశించిరి. మనకు అనవసరపు శ్రమ గల్గించిరి' అనెను. అంత విశ్వాసుడు లేచి 'అయ్యా మా యొనర్చిన దోషమేమియును లేదు కాని...,' అని ఏమో చెప్పబోవుచుండ నా ద్వేషబుద్ధి సింహామువలె

గర్జించి, గాడిదవలె ఓండ్రపెట్టి, 'మాచే నేరస్థులనబడిన వారుగాని, వారి తరఫువారుగాని మా యీ అన్యాయ స్థానమున నోరెత్తి మాట్లాడరాదు. మా చెప్పిన శిక్షకు బద్ధులగుట మీపని' అనెను. అంతట ఆ న్యాయవాదులందరు గుసగుస లాడిరి. వారు అంధుడు, దుర్బుద్ధి, కుబుద్ధి, క్రూరబుద్ధి, లోకవాది, మిథ్యావాది, శూన్యవాది, సర్వద్వేషి, పాపప్రియుడు, మోహప్రియుడు, భోజనప్రియుడు, మొదలగువారు. వారందరు విశ్వాసుని మొదటి ద్రోహిగా నిర్ణయించిరి. అతనిని వారి చట్టప్రకారము పొలిమేరలో కర్రలతో మోదిరి. రాళ్ళతో రువ్విరి. కత్తులతో గోసిరి. అగ్నితో గాల్చివైచిరి. ఆ విధముగా విశ్వాసు డంతరింప నొక అగ్నిమయమైన రథము ఆ ప్రాంతమునకు వచ్చెను. విశ్వాసు డా రథము నధిరోహించి మహా విభూతితో నెచ్చటికో వెళ్ళిపోవుట గాంచితిని. క్రైస్తవుని మాత్రము వారేమనుకొనిరోగాని నాడు చంపలేదు. బోనులోనే యుంచిరి. కాని నాటిరాత్రి యాతడు తప్పించుకొని శీఘ్రగమనముతో పరుగెత్తిపోయెను. అతడెట్లు తప్పించుకొన్నది నా కాశ్చర్యముగ నున్నది. కాని జగత్ సృష్టి స్థితి లయములకు కారణభూతుడైన సర్వేశ్వరు డామాత్రము కార్యము నెరవేర్పలేడా? రాతిలో మధ్యభాగమున పుట్టిన కప్పను పోషించు దయామయుడు తన భక్తులను రక్షింపడా? అనుకొని నాలో నేనే సమాధాన పడితిని.

క్రైస్తవుడు గమనోన్ముఖుడై కొంతదూర మేగెను. అంతలో ఆశావాది యనునాతడు ఆ మార్గముననే బోవుచు, నేను వచ్చుచుంటిని గదా! కలసిపోవుద మనెను. సత్యము

కోసము విశ్వాసుడు నిలువ, వాని దేహమును బుగ్గియైనది. ఆ బుగ్గినుండి యాత్రికునికి తోడుగా ఆశావాది ఆర్భవించి నట్లయినది. వారిరువురును నడచిపోవుచుండ మార్గమున పాషండు డనువాడు వారిని కలిసికొనెను. అతడును మంజు భాషిణియను పట్టణమునుండి బయలు దేరి స్వర్గసామ్రాజ్య మునుగూర్చి పోవుచుండెను. వాడు వీరిని జూచి "ఓహో! నిలు నిలుడు! నేనును వచ్చుచున్నాను గదా.

నే నెవ్వరినైనది మీరెరుగరు. అయిన నేమాయె? నేనీ ప్రాంతమున చాల పలుకుబడి గలవాడనే సుమీ! నా పేరు మీ కనవసరము. అయినను పేరులో నేమున్నదిలే! రోజాపుష్పమును జూచితిరిగదా! ఆ పేరుతో పిలువక పోయి నంత మాత్రమున దాని పరిమళము గాని, సహజ సౌంద ర్యముగాని, కుంటుపడునా యేమి, నా విషయముగూడ నంతియే! పోనిండు, మీ కుతూహలమును గమనించితిని. కనుక కొంచెము చెప్పెదను. సర్వ సంపదలకు తావలమైన మంజుభాషిణి మా పట్టణము. అందలి వారందరు నా బంధు వులే యైనను విశేషించి కొందరిని జెప్పెదను. సమయవాది, కాలవాది, వాగ్వాది, సర్వాభిలాషి, ద్విజీహ్వుడు మొదలు గాగల ప్రబుద్ధు లందరును మావారే! ఇంకను మా బావలు మామలు, మహానుభావు లున్నారు. యథార్థము-నకు మా తాత నీళ్ళు మోసికొని బ్రతికిన నేను మాత్రము చాల పెద్దమనిషిని సుమా. పెద్దతన మొక్క ప్రాయములోనే గాదు. నా భార్య భాగ్యశాలి వగలాడి కూతురైన మాయ లాడి. ఆబాల గోపాల మంతయు ఆవిడ నెరింగిన వారే. ఒక్క మీ యిద్దరు ఎరుగనంతమాత్రమున తీగవలె పెరుగు

చున్న ఆవిడ కీర్తి నిలిచిపోదా. పోనిండు దానికేమి! మత విషయములలో మాకంత గట్టినమ్మకము లేదు. ఏమందురా మనుష్యునికొరకు మతము పుట్టినదిగాని మతముకొరకు మనుష్యుడు పుట్టలేదు. అందుచేత ఏదో పుట్టిన మతము గిట్టకుండ అప్పుడప్పుడు కొంచెము పరామర్శించి వదలి వేయవలెను.

అతడీ విధముగా తెంపు లేకుండ మాట్లాడుచుండ, క్రైస్తవుడు ఆశావాదిని ప్రక్కకు బిలిచి వీని వాలకమును పలుకుబడిని బట్టి చూడ పాషండునివలె నున్నాడు. వీని తగులు మనకేల యనెను. అయిన నేమి అడిగి చూతమని ఆశావాది హెచ్చరింప, యాత్రికుడు, 'అయ్యా నీ మాటలు కోటలు దాటుచున్నవి. పాషండుడను మహానుభావులు తమరేయని మా యూహ. పొరపాటేమైనను గలదా' అనెను. వాడును 'ఓయి నీవు నిక్కముగా పొరబడితివి. అయిన నేమి? భ్రాంతి ధీమంతులకే సహజమైనప్పుడు అల్పులైన మిముబోంట్లకు ప్రత్యేకముగా నడుగవలెనా? నన్ను పాషండుడని ప్రజలు పిల్తురే కాని నా పే రదిగాదు. మహానుభావుల నెందరిని మారు పేరులతో ప్రపంచము వేళాకోళము చేయదు? నన్నును అంతియే! కాని ఈ పేరు నాకు సమ్మతమని మీ రనుకొనరాదు. చాటున ప్రజలు వాడుకొందురు. లోకులు కాకులు. వారి నోరుగప్ప మూకుడున్నదా యేమి? అప్పుడు క్రైస్తవు డిట్లనెను. 'అయ్యా మతముపై విశ్వాసము మీకులేదు. అట్టివారితో మాకు పొత్తులేదు' అందుకు పాషండు డిట్లనెను. 'మీకు లేకున్న నాకుమాత్రమున్నదా యేమి? పాప మిద్దరేగదా ఒంటరిగా బోవుచున్నారని దయ

దలచి మీకు తోడుగా నుండవచ్చితిని. నా దయకు మీారన
ర్హులు అనుచు వాడు వైదొలగెను. అంతలో మరి ముమ్వురు
వారిని జేరవచ్చిరి. వారు కాంచన ప్రియుడు, కామప్రియుడు,
కపటబుద్ధి అనువారు. వీరందరు నాపాషండునికి సహాధ్యా
యులు. వారు కామ కళానిధియను పట్టణమున చార్వా
కుడను గురువునొద్ద విద్య నభ్యసించిరి. అతడు బల
త్కారముతోను, మాయతోను, పొగడ్తలతోను, వేదవ్యా
పక మిషతోను ప్రపంచమున బ్రతుకుడని వీరికి నేర్పెను.
వీరును గురువును మించిన శిష్యులై నల్గురును నాలుగు పాఠ
శాలలు నాలుగు దిక్కులయందును స్థాపించి, వారి యవి
వేకమునకు తోడుగా మరికొన్ని యధర్మములు చేర్చి గురువు
గారి సందేశములను వ్యాప్తి చేయుచుండిరి.

ఆ కామపురుషులు కాకులట్లు ఒక్కచోగూడి గల గల
మాట్లాడుకొనిరి. ఆ ముందుబోవు వారెవరని ఒక డడిగెను.
'ఎవ్వరో దూర దేశీయులు. మతము కొరకు ప్రాణము
నైనను దారబోయు దౌర్భాగ్యులు. ఎదుటివారి మనసునకు
నొప్పి కలిగించెడు దురాత్ములు. మబ్బునుజూచి ముంతలోని
నీరును పారజల్లునట్లు ఎన్నడో రాబోవు సుఖమునకై చావు
నకు తెగించు తెలివితక్కువ దద్దమ్మలు. శుద్ధముగా
మొద్దులు. మిత్రులారా! అందుకే వారిని వదలి వేసితిని.
వారెక్కడ మనమెక్కడ' అని పాషండు డనెను. కాంచన
ప్రియుడు భళిరా! బుద్ధిమంతుడవోయి! మనమందరమును
కలిసి పోవుదము. సర్పములు తెలివైన వగుటచే మరి యే
యితర ప్రాణితోను గలియవు. మనము నంతియే. కాలము
నకు వేచియుండి సమయముజూచి కార్యము లారంభింప

వలయును. సముద్రపు టలలతో బయలు దేరితిమేని సులభముగా సముద్రములోనికి బోవచ్చును. పాపమా ముందు బోవు మందబుద్ధు లీ రహస్యము నెరుంగరు గదా! ఇట్లు వదరుచు నా వదరుబోతులు గుమిగూడి పోవుచుండ క్రైస్తవుడు ఆశావాది వారికంటెను చాలముందు నడుచుచుండుట గమనించితిని. ఈ గాడిదలతో నా కెందుకని క్రైస్తవునిపై లక్ష్యముంచి చూచుచుంటిని. అంతలో వారొక విశాలమైన మైదానమును దాటి యొక మలపునకు వచ్చిరి.

అచ్చట నొక బంగారపు గని యున్నది. పూర్వ మా మార్గమున బోవు యాత్రికులు గనిని జూతమని దగ్గరకు బోయి నిల్చిరి. అది జారుకుమట్టి యగుటచే జర్రున జారి కష్టపుగుంటలో బడి నశించిరి. కుటిల స్వభావముతో గూడిన కౌటిల్యుడను సార్థక నామధేయు డొకడచ్చట కాపుండి, వచ్చుచుం బోవుచుండు వారి నాశగొల్పి ఆ గుంటలో దింపుచుండును. వాడు మన యాత్రికులను జూచి "ఓహో మార్గస్థులారా! ఇటురండు. చాల కాలమునకు వచ్చితిరి. ఈ బంగారు గనిని జూచి మీ వలసినంత బంగారమును దీసికొని పొండు.' అనెను. ఆశావాది కొంచ మాశబోతు గావున క్రైస్తవుని జేరి, పోయి చూతమా అనెను. అతడు కోపించుకొని 'ఓయీ సన్మార్గమును వీడి దుర్మార్గమున బోయి మృత్యువు నోటిలో జొరబడుదువా యేమి? మాయలమారి సైతానుడు యాత్రికులను బంధింపనెంచి గని నెపమున పన్నిన వలసుమా యిది. వాని మాయలన్నియు నే నెరుంగుదును. పాపము! అమాయకులైన స్వర్గ సామ్రాజ్య యాత్రికులు మున్నెందరు వీని బంధములకు గురియైరో గదా?

నాయనా చాలుచాలు సుబుద్ధివై ఆ గనిని దర్శింప వలయు నన్న దుర్బుద్ధిని మానుము.' అనుచు సాగిపోయెను. అంతలో కుత్సిత వాదములు చేయుచు, తమ్ము తామే స్తుతించుకొనుచు నిష్కారణముగా పరులను నిందించుచు మూర్తీభవించిన కాపురుషులవలె ప్రపంచములో బ్రతుకు తెరువులు మన మెరుగనివా? కావు కావనుచు కాకులవలె నగచుచు వడిచి వచ్చి పాషండుడును వాని మిత్రులును ఆగనిని సమీపించిరి. కౌటిల్యుడును కుటిలత్వ ముచ్చుపడినట్లు కంఠమెత్తి నాయ నలారా! వచ్చితిరా, రా రండి. ఇదిగో బంగారు గని సుమండి. మీరు వలసినంత ద్రవ్య కొనండి అనెను. వారును అద్దిరా! అదృష్ట మనిన నిట్లుండవలె. ఇంతటితో మనమే యాత్రను విరమింప వచ్చును- అనుచు సంతోషముతో నాగనిగాపున గంతులు వైచిరి. అంతలోనే గబీలుమని యా గుంటలో కూలిపోయిరి. అయ్యో! మోసము మోసము, చచ్చితి మను కేకలు మాత్రము నాకు విని పించినవి. మన యాత్రికు లక్లైనడచి చాల దూరము పోయిరి.

ఒకచో నెట్టయెదుట వారి కొక్క శిలాప్రతిమ గానుపించినది. చూడం జూడనది స్త్రీ యాకారమున గోచ రించినది. పూర్వ మెవ్వరో నాతి రాశిగా మారియుండె నని వారు గుర్తించిరి. అంత దాని ముఖమున "లోతుని భార్య నెరుంగుదురే గదా" అని వ్రాయుంబడియుండుటను జూచిరి. క్రైస్తవు డిట్లనెను. 'పూర్వము పాపభూయిష్టము లైన సోదోము గొమొర్రా పట్టణములను నాశనము చేయుచు' సర్వేశ్వరుడు లోతుడను పుణ్యాత్ముని ముందుగా

బిలిచి ఆపట్టణమును విడిచిపొమ్మని చెప్పెను. కుటుంబ సహితముగా నాతడట్లు వెడలిపోవుచుండ, వెనుకకు దిరిగి చూడరాదని సర్వేశ్వరుని కట్టడైయున్నను, వాని భార్య దుర్మతియై వెనుకకు మరలి చూచెను. వెంటనే యాదౌర్భాగ్యవతి యిట్లు శిలాప్రతిమగా మారిపోయెను.! క్రైస్తవుడాశావాది కీకథ వినుపించుచుండ, నతడు పశ్చాత్తాపముతో 'ఔను ఈ స్త్రీకిని నాకును ఏమి భేదమున్నది. ఆవిడ వలదన్నను వినక వెనుకకు దిరిగి చూచినది; నేనును వలదన్నను వినక సన్మార్గమునువీడి దుర్మార్గుడనై ఆ గని జూడ నభిలషించితిని. పాపము శమించుగాక, దైవము మనల నుద్ధరించుగాక' అనెను. అంత కొంతదూరము నడచి వారొక నదిని సమీపించిరి. దాని తీర భూమి ఫలవృక్షములతోను, పుష్పించిన లతలతోను, పచ్చికతోను, కలకలారావములతో పలు రంగులతో, చెవికిని కంటికిని ఇంపు నింపు పక్షులతోను నిండి, చాల మనోహరమై యున్నది. ఆ తీయని ఫలములు భుజించి ఆ చల్లని జలములు త్రావి ఆవృక్ష చ్ఛాయలందు విశ్రమించి, యాత్రికులు కొన్ని దినములు అలసట దీర్చుకొనిరి. వలయునంత విశ్రాంతిని గైకొనిన పిమ్మట, వారు మరల పయనము సాగించిరి.

ఈ మారు వారు నడచు మార్గము ఎగుడు దిగుడుగను ముండ్ల కంపలతోను గూడినదై చాల బాధకరమై యుండెను. ఆశావాది అనుమానించి దారి తప్పితిమేమో గదా అనెను. క్రైస్తవుడు మితిమీరిన యుత్సాహముతో కన్ను గానక ఇదే మార్గము, రా రమ్మని ఆశావాదిని బలవంతము చేసెను. వారట్లు దుర్మార్గమున నడుచు చుండ

ముందొకడు అవివేక బుద్ధియనువాడు పోవుచుండెను. వాడు అనుమానముతో పెండ్లి నడకలు నడచుచున్న వీరిని జూచి 'జాగొనరించెదరేల? స్వర్గ సామ్రాజ్యమునకు బోవు మార్గమిదియే' అని కేక పెట్టెను. క్రైస్తవుడును ఆశా వాదిని హెచ్చరించుచు వింటివటోయి! మనము నడువ వలసిన మార్గమిదియే సుమా యనుచు ముందున్నవానిని పిలిచి, మేమును వచ్చుచుంటిమి గదా క్షణమాత్రము నిలువందగదా యనెను. అంతలో నా యవివేక బుద్ధి యొక పెద్ద అగాధములో బడి, అయ్యో దుర్మార్గము; చెడితిని చెడితినని పెద్దగా నార్భటించెను. క్రైస్తవుని గుండె జల్లు మనెను. ఆశావాది నిరాశతో బిక్కమొగము వేసెను. ఇంతవరకును వారు నడచినది తప్పు త్రోవయని తెలిసి కొనిరి. అంతలో నాకాశమున మేఘములు క్రమ్ముకొనెను. చల్లని గాలి విసరెను. ఆ మీదట మింటికి మింటికి నేక ధారగా కడవలతో ముంచి వంచినట్లు కుంభ వర్షము కురిసెను. ఆ వర్షపునీరు కాలువలై వెల్లువలై ప్రవాహము వలె బోరు బోరున హోరుమని శబ్దింప జొచ్చెను. ఎటు జూచినను జలమయము. వారి యెక్కడున్నట్లు? ఎటుపోవుట? ఎక్కడ నిలుచుట? అట్టి దీనావస్థలో నున్నవారి కొక పెద్ద మఱ్ఱి చెట్టు గానుపించెను. దాని మొద్దు నాశ్రయించి వారా రేయి ఎట్లనో గడిపిరి.

అంతలో తెల్లవారినది. ఆ ప్రాంతమునంతయు కర్కోటకుడను రాక్షసు డాక్రమించి, వాని బంటులతో కాపురముండెను. వాడును ఆరాత్రి వర్షమునకు తన పొలము లెట్లు పాడైపోయినవోయని తహ తహ లాడుచు తెల తెల వారు

చుండగనే లేచి వచ్చెను. ఆమఱ్ఱిచెట్టు దాపున నున్న యాత్రికులను జూచి తలయూచి 'ఓరోరీ! మీరెవ్వరు? దేశ దిమ్మరులవలె గాన్పించు చున్నారే. ఇంత దేశముండ మీరు నిలుచుటకు నా పొలమే దొరికినదిగా? అందులకు నా యనుమతి నైనను లేదుగా! మీ కండ కావర మిట్లున్న దిగా?' అనుచు వారిని యీడ్చుకొని పోయెను. పాపము క్రైస్తవు డేదియో చెప్ప బ్రయత్నించెను. కాని యా రాక్షసుడు రూక్ష వీక్షణముల, నోరుమూయుమురా బిడుగ యని గద్దించెను. అట్లు తోసికొని పోయి వారి నొక చీకటి కొట్టులో బంధించెను. అచట వారికి అన్నపానీయములే గాదు చూచుటకు వెలుగైనను పీల్చుటకు గాలియైనను లేదాయెను.

ఆ రాక్షసునకు చండికయను భార్యగలదు. అది ప్రచండ స్వభావము గలది. పిలువకనే పలుకును. పలికెనా గుఱ్ఱము సకిలించి నట్లుండును. మగ డెదురాడెనా కొట్టకనే యేడ్చును. ఏడ్చెనా గాడిద ఓండ్ర పెట్టినట్లు తేలుగుట్టిన కుక్క లేడ్చిన ట్లుండును. దానికి రాక్షసుడా రాత్రి తాను యాత్రికులను బంధించిన విషయము నెఱింగించెను. వారినేమి చేయుదమని యడిగెను. ఆలోచించి చెప్పెదనని చండిక నిద్రించెను. తెల్లవారగనే ఆమొక చురుకైన చండ్రకోలతో యాత్రికుల యొద్ద కేగెను. వారును దాని ప్రచండ స్వభావమునకు భీతిల్లి కెవ్వున కేకలువైచిరి. రాక్షసి వారిపై కురికి మృగములనట్లు చండ్రకోలతో మోదెను. వారెలుగెత్తి హా దైవమా! హతభాగ్యులమని యేడ్చిరి. అట్లు కొంతసేపు బాది అలసి, రొప్పి, రొజుచు

మరిమోదలేక రాక్షసి మరలి పోయెను. అప్పటి వారి దీనావస్థను వీక్షించు సరికి నా కన్నుల వెంట నీరు గిఱ్ఱున దిరిగినది. కలలోనే ఆ కన్నీరు చేతులతో తుడిచి కొంటిని. అంతట రాక్షసి మరునాటి యుదయమున మరలి వచ్చి గోడలు కరచుకొని కూర్చొనియున్న వారిని గాంచి రౌద్రముతో 'జీవచ్ఛవము లార! ఇంకను జావరైతిరిగా! ఎవరి నుద్ధరింతమని బ్రతికి యున్నారు. అనుచు పూర్వపు రీతినే చండ్రకోలతో మోదెను. కొంత సేపటికి రొప్పు పుట్టినది. అది కొంచమాగి మీరిట్లు చచ్చునట్లు లేరు. ఒక్కమారుగా గొంతు నులిమి వైచెద ననుచు మీదికెగిరెను. కాని అంతలోనే పేడ సిబ్బివలె తటాలున భూమిపై చతికిల బడెను. నోటివెంట నురుగులు గ్రక్కెను. దీనికి మూర్ఛ రోగమున్నది గాబోలని నే ననుకొంటిని. కొంత సేపటికి తెప్పరిల్లుకొని తన ప్రయత్నము నుండి విరమించుకొని 'దౌర్భాగ్యులారా! మీకీ చెరసాలనుండి విముక్తిలేదు. కొన్నాళ్ళిట్లే కష్టపడి కుమిలి కృశించి నశింప గలరు. ఇదిగో కత్తి. అదిగో విషము. బుద్ధిమంతులై ఆత్మహత్య గావించుకొని సాధ్యమైనంత త్వరలో ఈ బాధలను తప్పించుకొని సుఖపడుడు' అనుచు వెళ్ళిపోయెను.

అప్పుడు యాత్రికులు ఈ బాధ ననుభవించుట కంటె చచ్చుట మేలుగదా! ఈ విషము ద్రాగుద మనుకొనిరి. అంతలో ఆత్మహత్య వేదసమ్మతము గాదని వారి యంతరాత్మ లుద్ఘోషించినవి. ఔను మన మెవ్వరము? భగవంతుడు నిర్మించిన పాత్రలము. మనలను పుట్టించుటకు గాని గిట్టించుటకుగాని ఆయన పనిగాని మన పనిగాదు.

దయామయుడైన ఆ భగవంతుని కృపవలన నొక యుపాయము గలిగెనా, నిరపాయముగా దప్పించుకొని పోవచ్చును. పందలవలె చచ్చుటదేమి మొగతనము? ఒకవేళ చచ్చితిమి. చచ్చి సాధించునదేమి? బ్రతికి యుండిన శుభములు బడయ వచ్చునని పెద్దలు చెప్పుదురు. ఇట్లాలోచించి వారు ప్రార్థనను బూనుకొనిరి. దీర్ఘకాలము జపించిరి. ఆలోగా రాక్షసి వచ్చి తన యానతిచ్చినట్లు వారు చావకుండుట గాంచి మత్సరించి, వారినొక తిన్నెపైకి తీసికొని పోయెను. ఆ గుట్ట మనుష్యుల ఎముకలు, అస్తిపంజరములు, తల పుర్రెలు. ఆ మార్గమున వచ్చు యాత్రికుల నందరను వారట్లు బంధించి బాధించి సంహరించుచు వచ్చిరి. వారి ఎముకలు కొండ పరిమాణముగా గుట్టబడినవి. యాత్రికుల కాదృశ్యము జూపి మీ గతియు నింతియే. మేము చంపకుండ మీరయింతట మీరే చచ్చితిరేని మేలు సుమా! అని చెప్పి మరల చెరలోనికి దీసికొనిపోయెను. అచ్చట వారు దీన దృష్టితో మిన్నును జూచుచుండ మీద వంకెకొక తాళపు చెవి వ్రేలాడుచున్నట్లు కనుగొనిరి. దానిపై సాహాయ్యమని వ్రాయబడి యుండెను. క్రైస్తవుడు ఆత్రముతో దానిని దీసికొని దాళమును దెరచెను. మిక్కుటముగా నుండిన చెఱువు నుండి కట్టదెగి నప్పటి నీటివలె చేతికి జిక్కకుండ పంజరమునుండి పారిపోవు పక్షులవలె యాత్రికులు పరుగెత్తిపోయిరి. వారు తెరచు నప్పుడు తలుపు కిర్రుమని మ్రోత పెట్టినది. ఆ సద్దు విని రాక్షసి పరుగెత్తుకొని వచ్చినది. కాని అప్పటికే యాత్రికులు చూపుమేర దాటి పరుగెత్తిరి. రాక్షసియు వెంటబడినది గాని, ఒక చోట

రాయి తట్టుకొని బోర్లపడినది. అప్పుడు మన యాత్రికులు వెనుకకు బరుగెత్తి, పూర్వపు సన్మార్గమున గలసిరి. ఇక రాబోవు యాత్రికుల కొరకని వారొక స్తంభము పాతి దానిపై "ఈ ప్రాంతమున కర్కోటకుడను రాక్షసుడు యాత్రికులను బాధించును. దారి దొంగకుడు. జాగ్రత్త" అని వ్రాసి పోయిరి.

అంతట యాత్రికులు నడిచి పోయి పోయి, ఆహ్లాద పర్వతమును జేరిరి. పూర్వము కన్యకలు వారికి జూపిన కొండ లివియే. వానిపై సుందర వనములు, మంచినీటి చలములు ద్రాక్ష తోటలు, ఒక్కటేమిటి, ఎటు చూచినను కనులపండువుగా నుండెను. అచ్చట కొందరు గొల్లలు గొర్రెలను మేపుచుండిరి. మన యాత్రికులు వారిని సమీపించి, అలసటతో నున్నందున తమ చేతికర్రలపై గడ్డములు మోపి, అయ్యా ఈపర్వతము లెవ్వరివి. మీరెవ్వరు అని అడిగిరి. వారును ఈ కొండలు ఈగొర్రెలు మొత్తమును ఆ జగదీశ్వరునివే. ఆప్రభువు స్వర్గసామ్రాజ్యమున కిడిదే దారి. మీరును చూడగా యాత్రికులవలె నున్నారు. యాత్రికుల కిచ్చట ననేక సౌకర్యము లున్నవి. ఇందు రండని గొల్లలు యాత్రికుల నాదరించిరి. వారు విజ్ఞాని, అనుభవజ్ఞుడు, జాగరూకుడు, సత్యకాముడు ననువారు. యాత్రికులును వారి గుడారములలో అన్న పానీయములతో తృప్తిజెంది కొంచెము సేపు విశ్రమించిరి. గొల్లలు అయ్యా! మీరిందు జూడదగిన విశేషములు చాల గలవు. కొంతకాల మిచ్చటనే నిలువు డనిరి.

మరునాటి ఉదయము మీపరులు యాత్రికులను వెంటబెట్టుకొని పర్వతములపై కెక్కిపోయిరి అచ్చట నొక

ఉన్నత శిఖరమునకు దీసికొనిపోయి, అగాధమైన క్రింది లోయను జూపించిరి. ఆశిఖరము పేరు ప్రమాదము. ఆ లోయలో చాలమంది రాళ్లపై జారి దొర్లిపడి చచ్చియుండుట గమనించి, క్రైస్తవుడు వీరెవ్వరనెను. గొల్లలు శరీరము యొక్క ఉత్థానము విశ్వసింపమని ప్రతిఘటించిన మహానుభావులు కొందరున్నారని మీరెరుంగుదురు గదా! వారే వీరు అనిరి.

అంతటవారు వేరొక శిఖరముపై నెక్కి క్రిందికి పరికింప, నచట సమాధులు గాన్పించెను. అందు గ్రుడ్డివారగు నేకులు పడుచు లేచుచు దిరుగుచుండిరి. వీరెవ్వరని క్రైస్తవుడన, మెపరు లిట్లనిరి. ఈ ప్రాంతమున కర్కోటబకుడను రాక్షసుండు గలడు. ఈ సన్మార్గమునుండి వేరొక దుర్మార్గము చీలి వాని పొలములోనికి బోవును. వీరందరును మీవలెనే ఒకప్పుడు యాత్రికులై వచ్చి, ఆ మార్గమున బోయి వానిచే బట్టువడిరి. చాలకాలము వాని చెరలో బాధలనుభవించిరి. అంతటవాడు నిర్దయతో వారి కన్నులు పెరికి వైచి ఈ లోయలో విడిచెను. వారు బ్రతికియు చచ్చినవారే! ఈ మాటలు వినుసరికి మన యాత్రికులకు దేహము జలదరించినది. వెండ్రుకలు పులకరించినవి. కాని వారి వికారమును గొల్లలు గమనింప లేదు.

అంతట కొండశిఖరము దిగి, వారొక నిమ్న భాగమునకు వచ్చిరి. అచ్చట ఒకద్వారముండ దానిని తెరచి లోపల జూడుమనిరి. యాత్రికులు తొంగి చూచిరి. పాతాళములో పెద్ద అగాధము. అచ్చట గంధకము గనగన మండుచున్నది. పొగ నిండియున్నది. చీకటి క్రమ్మియున్నది.

అందెవ్వరో పరమ దౌర్భాగ్యులు వంగ్లు వటవట కొరుకుచు వద్చుచు పెద్ద బొబ్బలతో నార్భటించుచున్నారు. ఇది యేమని యాత్రికుడడుగ గొల్లలిట్లనిరి. ఇది నరక ద్వారము. ఇందున్నవారు అసత్యవాదులు, దేవదూషకులు, అబద్ధ సాక్షులు.

అంతట వారొక మహా శిఖరము నధిరోహించిరి. గొల్లలు వానికొక అద్దమును జూపి దానినుండి చూచిన మీకు స్వర్గసామ్రాజ్యపు బాహిర కవాటములు గన్పించు ననిరి. యాత్రికులట్లే చూచిరి. వారికంత స్పష్టముగా గన్పింప లేదుగాని, ఏవో కోట బురుజులు పెద్ద తలుపులు గాన్పించినవి. అప్పుడు గొల్లలిట్లనిరి. నాయనలారా! సదా ఋజుమార్గ మున నే సంచరింపుడు. మోసగాండ్రై పాకడ్తల కుబ్బిపోయి చీకాకు పడకుడు. మాంత్రికుల దుష్ట భూములందు మైమ రచి నిద్రింపకుడు.

అంతట యాత్రికులు మేపరులను వీడ్కొని పయ నమై పోవుచుండ దారిలో నొకమూర్ఖుడు తోడుపడెను. వాడా ప్రాంతమునుండి బయలుదేరి తప్పుడు త్రోవబట్టి ఈమార్గమున వచ్చెను. వాడును స్వర్గ సామ్రాజ్యమునకే బోవుచున్నాడు. క్రైస్తవుడు వానితో అయ్యా! నీవు ఈ మార్గమునకు ఆ సూక్ష్మ ద్వారమునుండియే రావలయును గదా! పైగా ఆసామ్రాజ్యములో నేదేని గుర్తు అడుగుదురు గదా! అప్పుడు నీ వేవి చూపగలవు, అనెను. వాడును తిర స్కార పూర్వకముగా అవన్నియు నే నెరుంగుదును. మీది మీ దేశాచారము. మాది మా దేశాచారమనెను వీనితో మనకు పొత్తు కుదరదని మన యాత్రికులు పోవుచుండిరి.

ఆదారి యొకచోట రెండుగా చీలియున్నది. ఏమార్గమున బోవుటకును తోచక వారచట నిల్చియుండిరి. అంతలో నొకడు నల్లని దేహము గలవాడు తెల్లని బట్టలను గప్పుకొని వారికి ప్రత్యక్షమయ్యెను. వారు తమప్రయాణము నెరింగించి దారి తెలియదనిరి. వాడును నేనును అచ్చటికే పోవుచున్నాము. నాతో రండని వారిని తీసికొని పోయెను. ఆదారి పాము మెలికలతోను ఎగుడు దిగుడులతోను కంగారుగా నుండెను. వారా మార్గమున నడచుచు కొలనని తలంపుగా నొకచోట వలలో జిక్కుకొనిరి. సాలీని గూడువంటి యావలలో జిక్కి, కీటకములవలె గిజగిజ తన్నుకొనిరి. క్రిందు మీదైరి. ఒడ్డునబడిన చేపవలె నెగిరి; పడిరి కాని శరణ్యాము లేదు.

అట్టి దురవస్థలో నొక తేజోమూర్తి వారి యొద్దకు వచ్చి మీ రెవ్వరనెను. యాత్రికులు తను యుదంతమును జెప్పి అంగలార్చిరి. అతడును, మీరు ఆహ్లాద పర్వతముల నుండి వచ్చితిరిగదా. అందు మేపరులు "సదా ఋజు మార్గమున సంచరింపుడు. మోసగాం!డ పొగడ్త కుబ్బి పోయి చీకాకు పడకుడు" అని హెచ్చరింపలేదా అని అడిగెను. అది యంతయు నిజమే. మందబుద్ధులమై ఇట్టి దురవస్థకు పాలైతిమి. క్షంతవ్యులము అని యాత్రికులనిరి. ఆ తేజోమూర్తి వారిని వలలోనుండి వదలించి బుద్ధిమంతులరై సాగి పొండనుచు నదృశ్యమయ్యెను.

వారు పోవుచుండగా దారిలో నొక తెరువరి వారిని కలసికొనెను. వాని పేరు నాస్తికుడు. వాడు వీరి ప్రయాణమును విని పకపక నవ్వెను. 'వెర్రిమొగములారా! స్వర్గ

సామ్రాజ్య మనునది లేనేలేదు. నేనును ఒకప్పుడు మీవలెనే ఈ వార్తలు వింటిని. నాటినుండి నేటివరకు ఇంచుమించు ఇరువది సంవత్సరముల కాలము దానికై వెదకి వెదకి వేసారితిని. నేటివరకును గన్పింపలేదు. అసలున్నగదా కనిపించుట. కావున మీ ప్రయాణమునకు ఫలితము వృథా శ్రమయే. నేను మీ ముందు నూరు యోజనములు పోయి చూచితిని. కాని అచట నేమియు లేదు. అందుకే మరలి పోవుచుంటిని" అని మరలా పకపక నవ్వుచు వెనుకకు బోయెను. ఆశావాది 'ఈతని వాక్యములు వింటివి గదా. ఇప్పుడేమి జేయుద' మనెను. క్రైస్తవుడును 'ఓయి మోసగాండ్ర పాగట్టల కుబ్బిపోయి చీకాకు పడకుడు అన్న వాక్యమును స్మరింపుము. ఈతడును వారిలో నొకడు. అనవసరముగా మనస్సును కలత పడనీయకుము. పద పదమ'నెను.

అట్లు పోవుచుండ నొక మైదానములో వాతావరణము విపరీతముగా నున్నది. ఒడలు మత్తెక్కి మాంద్యము క్రమ్ముకొనినది. ఆవులింతలు కూరుకుపాట్లు అతిశయించినవి. ఆశావాది "ఒడలు వశముగాదు. నడక సాగుటలేదు. నిద్ర అలసటను తొలగించు నందురు. కొంచెము సేపు నిద్రించుదమా" అనెను. క్రైస్తవుడు ఓయి, విపత్ కాలమున నీ విపరీత బుద్ధులేమిటి? మాంత్రికుల దుష్ట భూములందు మైమరచి నిద్రింపకుడు అనిగదా వారు హెచ్చరించిరి అనెను. అతడు అవునవును. బ్రతికి పోయితిమి. పద పద మ'నెను అనుచు నడచుచునే నిద్రతో తూగుచుండెను. క్రైస్తవుడు 'ఓయి ఈ దరిద్రపు నిద్ర నిన్ను వదలనట్లున్నది. ఒక కథ చెప్పెదను. శ్రద్ధతో వినుము. ఒక బాటసారి కాకులుదూరని

భీకరారణ్యముగుండ నడచి పోవుచుండెను. అందు ఒకవైపు నుండి దొంగలు వేరొక వైపునుండి దుష్టమృగములు వానిని పట్టుకొనుటకై ప్రయత్నించుచుండ, వాడు వేగముగా పరుగెత్త జొచ్చెను. ఎంత దూరము పరుగెత్తినను అడవి కంతము గానరాలేదు. అప్పుడొక వికృతపుస్త్రీ వానిని బలవంతముగా కౌగలించుకొనెను. అచ్చట నొక బావిపై దట్టముగా గడ్డి పెరిగినందున గుర్తింప వీలులేనిదై యుండెను. తటాలున నా బాటసారి ఆ బావిలో కూలెను. దాని యొడ్డున ఒక పెద్ద చెట్టు, ఆ చెట్టున కల్లుకొని తీగ బావిలోనికి ప్రాకి యుండెను. బాటసారి ఆ తీగను బట్టుకొని కొమ్మనున్న పనసపండువలె వ్రేలాడజొచ్చెను. అతడు క్రిందికి జూడగా పండ్రెండు శిరసుల పామొకటి నాలుకలు కోరుచు బుస కొట్టుచున్నది. దానిని జూచి గుండెపగిలి పైకి చూడగా తెల్లని నల్లని ఎలుకలు రెండు ఆ వృక్షపు వేళ్ళను ఛేదించుచున్నవి. ఆ చెట్టునొక ఏనుగు తొండముతో నూపుచు పెళ్లగింప జూచుచున్నది. ఆ యూపుల కదిరి కొమ్మలలోనున్న తేనెతెట్టె పగిలి మధుకణములు బొట్లుబొట్లుగా కారుచున్నవి. వానిని బాటసారి చప్పరించుచున్నాడు. వానికప్పుడు దొంగలు సమీపించుచున్నారని కాని, ఆ వృక్షము పడిపోవుచున్నదని కాని, బావిలోని సర్పము కరవనున్నదని కాని చింతలేదు. చాలకాల మందే జీవించి ఆ తేనెబొట్లు చప్పరింపవలె ననియే వాని ఆశ' అని చెప్పి క్రైస్తవుడు బోధపడినదా?' యనెను. యాత్రికుడు లేదనెను. 'అయిన వినుము. ఆ యంతులేని అడవి సంసార మనుకొనుము. అందలి దొంగలు, దుష్ట మృగములు, ఆ వికృత స్త్రీ బలవంతపు

కౌగిలింతలను ఇంద్రియ వాంఛలుగా నెరుంగుము. ఆ చెట్టు ఆయువుగను, ఆ తీగను జీవితాశగను తెలిసికొనుము. ఆ సర్పము మృత్యువు, మరి యా నల్లని తెల్లని ఎలుకలు రేయింబవళ్లు. ఆ తేనెబొట్టులు సహారా ఎడారిలోని చిన్న తుప్పల వంటి కొంచెముపాటి సంసార సుఖములు. వానిని మరిగి మూర్ఖులీ సంసారము నంటిపెట్టుకొని తిరుగుచుందురు. బుద్ధిమంతులో యనిన, సాధ్యమైనంత శీఘ్రముగా సంసార బంధములను ఛేదించి వైతురు. అని ఇట్లు కథ చెప్పునరికి, వారా దుష్టభూమిని దాటిపోయిరి.

అచ్చట నొక విశాలమైన మైదానమును ప్రవేశించిరి. అందలి భూములు పైరు పంటలతో కలకల లాడుచున్నవి. రంగురంగుల పిట్టలు కిలకిలారావములు చేయుచున్నవి. విప్పారిన పూవులనుండి తీయని గాలులు హాయిగా వీచుచున్నవి. ఎంత కాంతులతో జిగేలు మనిపించు స్వర్గసామ్రాజ్య మచ్చటికే దృగ్గోచర మగుచున్నది. ఆ పట్టణమున నివశించు తేజోమూర్తులు కొందరు వారి కగుపించిరి.

వారు దగ్గరించిన కొలది, పట్టణము స్పష్టముగా కనుపించినది. అందలి భవనములు పాల రాతితో నిర్మింపబడినవి. వానిపై వజ్ర వైడూర్యములు మరకత మాణిక్యములు చెక్కబడినవి. ఆ పైన మేలిమి బంగారముతో పూతపూయబడినది. ఇన్ని వన్నెలతో ఇంద్ర ధనుసువలె మెరసిపోవుచున్నది. నగరమున కొకవైపున ఏరు పారుచున్నది. నీరుగాదు ప్రవహించునది. తేనె పాల కలయిక. ఆ ముందర దాక్ష ఖర్జూరాది సుందర వనము లున్నవి. వారా తోటలోనికి బోయి కొన్ని ఫలములు భుజించి సంతోష

ముతో నాటి రాత్రి నిద్రించిరి. సూర్యోదయ మగునప్పటికి మేల్కొని చూచిరి. సూర్య కిరణములు పైబడుటచే నా బంగారు పట్టణము మిలమిల మెరసి పోవుచుండెను. యాత్రికు లటుచూడలేక కన్నులు మూసికొనిరి.

ఆ పట్టణమునకు ముందొక నది ప్రవహించు చున్నది. యాత్రికు లానది దాటినగాని ఆవల కాలిడ లేరు. దానిపై వంతెన లేదు. ఎంత లోతో తెలియదు. ఏమి చేయుటో అంతకన్నను తెలియదు. వారొకింత తడవు నటు నటు పరికించిరి గాని ఏమియును దోచలేదు. ఇక చేయునదిలేక నదిని దాటిపోవ నిశ్చయించిరి. నదిలో కొంత దూరము పోవుసరికి మోకాలిబంటి నీరు కుత్తుక నంటు కొన్నది. ఆ మీద తల మునకలైనది. మరి కొంత దూరము పోవ కాళ్లు నేల నానలేదు. అప్పుడు క్రైస్తవునకు అందో ళన మెక్కువైనది. అంతయు చీకటి మయమైనది. ఏవో దయ్యములు భూతములు తన్ను బాధించు నట్లయినది. నిరాశ మిక్కుట మైనది. అయ్యో హతభాగ్యుడను. ఆవలి దరి జేరుటకల్ల. నా పాపములకుగాను భగవంతుడు నాకీ నికృష్టపు చావు విధించినాడు అని ప్రలాపించెను. ఆశా వాదియును అయ్యా! ధైర్యము తెచ్చుకొనుము. అదిగో! ఆవలి వైపున మనుష్యు లగుపించు చున్నారు. వారు మన కోసము ఎదురు చూచుచున్నారు అనెను. క్రైస్తవుడు ఓయీ! నీ వెల్లప్పుడు ఆశావాదివే. నీ ఆశ నిన్నుద్ధరించిన నుద్ధరించు నేమోగాని, నాకు శరణ్యము లేదు అనెను. అట్లనుకొనుచు విచారించుచు కొంతదూర మేగుసరికి వారి పాదములకు నేల అందెను. అచ్చట క్షణము పాటు నిలిచి

లేని ధైర్యము తెచ్చుకొని, ముందునకు నడువ క్రమ క్రమముగా నీరు తగ్గుచుండెను. చివరకు ఒడ్డు చేరుకొనిరి. ఆ యొడ్డున కొందరు దివ్య పురుషులు నిలిచి యున్నారు. వారు వీరికి స్వాగత మిచ్చి ముందునకు తీసికొని పోయిరి.

స్వర్గసామ్రాజ్యము మేఘమండలమునకు పై మండలమున నిర్మింపబడి యున్నది. ఆ యున్నత స్థానమునకు నడుచునప్పుడు వారి కాయాసము కలుగ లేదు. పైగా ఉత్సాహము ఆనందము అతిశ యించినవి. ఆ పుణ్యపురుషు లిట్లనిరి. మీరు పోవు స్వర్గ సామ్రాజ్యమున నన్మనస్కులును పితాపితృలును కొలువు తీర్చి యుందురు. మంచు వంటి తెల్లని వస్త్రములను ధరించి పరిశుద్ధులై మీరందు ప్రవేశించెదరు. సర్వేశ్వరుని ముఖా ముఖగా దర్శింతురు. ప్రపంచములో మీరు చూచివచ్చిన వ్యాధి బాధలు ఆకలి దప్పులు కామ క్రోధాదులు ఇందుండవు, అని చెప్పుచుండగా వారు విస్మయపడి అచ్చటికి పోయి మేమేమి చేయవలయు ననిరి. ప్రపంచములో సర్వేశ్వరునికిగా మీ రనుభవించిన బాధలకు సంభావన లందుదురు. మీ జప తపములకు ఫలితము గాంచుదురు. స్వర్ణ కిరీటములు ధరించి మీ ప్రభువుని గాంచి సంతోషించెదరు. సేవించెదరు. ఆయన మహిమలో లీనమై సంతోషమున మునిగి తేలు చుందురు. మీ ముందును మీ తరువాతను, వచ్చిన రాబోవు పుణ్య పురుషులతో సంభాషించెదరు. మీ ప్రభువు మేఘములపై విజయము చేయునాడు, మీరును కలిసి వత్తురు. ఆయన న్యాయ సింహాసన మధిరోహించునాడు మీరు ప్రక్కన నిలుతురు.

అట్లు సంభాషించుచు పోవుచుండ స్వర్గ సామ్రాజ్యము నుండి కొందరు వారి కెదురువచ్చి స్వాగత మిచ్చిరి. మరికొందరు సంగీతము పాడుచు వారిని ముందునకు నడిపించిరి. అట్లు మహా వైభవముగా నడచి పోవునప్పుడు కొందరు ముందు, కొందరు వెనుక, కొందరు ప్రక్కల నిలిచి యుండిరి. అప్పుడు యాత్రికు లెంతగా సంతోషించిరో చదువరీ! నీవే యూహించుకొనుము. అంతటి మహదానందముతో నడిచి వారు సింహ ద్వారమును జేరిరి. వారి నాహ్వానించుచు నచ్చటి గంటలన్నియు గణ గణ మ్రోగినవి. ఆ ద్వారముపైన సువర్ణాక్షరములతో ఈ ద్వారమున వచ్చువారు భాగ్యవంతులు. ఏలయనిన వారు సర్వేశ్వరుని కట్టడల ననుసరించిన పుణ్య మూర్తులగుటచే నికమీదట నిత్య జీవితమును జీవింతురు. అని వ్రాయబడి యుండెను. ఆ ద్వారమువద్ద నిలుచుండి, వారు మోషేరాజును పిలిచి వినాశక పట్టణమునుండి వచ్చిన యాత్రికులు వీ రేయని చెప్పిరి. యాత్రికులు వారి శ్రీముఖముల నచ్చట నమర్పించుకొనిరి.

అంతట మోక్ష ద్వారములు తెలువబడినవి. యాత్రికులు లోనడుగిడిరి. ఓహో విచిత్రము! వారిప్పుడు పూర్వపు మనుష్యులు గారు. వస్త్రాడంబరములేని మేఘముల వంటి తెల్లని వస్త్రములతో సూర్యునివలె మెరసిపోవు చున్నారు. ఆ పుణ్య పురుషులలో జేరి "ఉన్నత పరమండలములో వసించియుండు సర్వేశ్వరునికి సదా మహిమ గౌరవము స్తుతి స్తోత్రము కలుగునుగాక" అని పాడుచున్నారు. అదిగో అనంత మహిమాన్వితమైన దివ్య తేజముతో ఆ ప్రభువు

ఎదురువచ్చి బిడ్డలారా! మీ కొరకై యేర్పరుపబడిన స్వర్గ సామ్రాజ్య మిదే. సిద్ధముగా నున్నది. రండ'నుచు తోడ్కొని పోవుచున్నారు. ఉన్నత పరమండలమున సర్వేశ్వరునికి మహిమ అని సన్మనస్కులు గానము చేయుచు స్తుతించు చున్నారు ఆహా! ఆ ప్రసన్న దృశ్య మేమని వర్ణింపను! ఆఁ అదేమి? ఇంతలోనే ద్వారములు మూయుచున్నారు. లోపలి దృశ్యమిక గాన్పింపదు గదా! యని విచారించి అటునిటు జూచుచుంటిని అంతలో వేరొకడు వచ్చుచున్నాడు వీ డెవ్వడు చెప్పుమా యనుకొంటిని. ఓహో, మనమిత్రుడు మూర్ఖుడు. వాని తెలివి నేమనను! ఆ నదినొక తెప్పతో దాటి అనాయాసముగా వచ్చినాడు. గంపెడాశతో పడుచు లేచుచు, సింహద్వారమువద్దకు వచ్చినాడు. పై యక్షరములను చదివి ఆశతో తలుపులు తట్టినాడు. ఆతని కెవ్వరును స్వాగత మీయలేదు. అట్లు కొంతసేపు తట్టినంత ఆ తలుపులు తెరచి నీ వెవ్వరవని ఆ పుణ్యపురుషు లడిగిరి. నీ శ్రీముఖమును జూపుమనిరి. వాడొకింత తడువుకొని 'లేదు. లేకున్న నేమాయె? నేనును సర్వేశ్వరుని సేవింపనేగదా వచ్చితిని. లోపలికి తీసికొని పొండు" అనెను. వారు లోపలకుపోయి మరల తిరిగివచ్చి వానిని పట్టుకొని బంధించి కొండ క్రింది భాగమునకు తీసికొని వచ్చిరి. అక్కడ నొక్క ద్వారమును తెరచి, అంధకార కూపములోనికి వానిని దింపిరి. అది నరకమునకు పోవుమార్గము. వినాశక పట్టణమునుండియు వేరొక త్రోవ వచ్చి ఈ మార్గములో గలయుట జూచితిని. మూర్ఖుడు రోదనము చేయుచు నందులో బడిపోయెను.

ఆ పుణ్యపురుషులు మరలిపోయి స్వర్గద్వారమును మూసివైచిరి. నాకు చూడదగిన వస్తువేమియు గాన్పింపలేదు. మరెవ్వరైన యాత్రికులు వచ్చుచున్నారేమోనని మార్గము వెంట జూచితినిగాని యెవ్వరును వచ్చుటలేదు. కన్నులు మూసికొన్నచో నేమియు గన్పించుటలేదని తెరచి చూచితిని. ఏమున్నది. నేను నిద్రించుచున్న కొండగుహ తప్ప నేమియు లేదు. అదియొక సుఖస్వప్నము.

ప్రథమ భాగము సంపూర్ణము



# యాత్రికాభ్యుదయము

## రెండవ భాగము

చదువరీ! ఇంతకుముందు క్రైస్తవుడు స్వర్గసామ్రాజ్యమునకు యాత్ర చేయుటనుగూర్చి చెప్పియుంటిని. ఆ సమయమున ప్రారంభముననే క్రైస్తవుని భార్యాబిడ్డలను గూర్చి కొంత ప్రస్తావించితిని. నాశనము గానున్న వినాశక పట్టణమును విడిచి క్రైస్తవుడు పోవునప్పుడు వారు ఆ పట్టణమును విడుచుటకు గాని, అతని తోడి యాత్రకుగాని సమ్మతింప నైరిగదా. ఇటీవలి ప్రపంచ వ్యాపారములలో జిక్కుకొని యుండుటచే నాకు తీరిక దొరికినది కాదు. ఐనను ఎట్లో సమయమును జూచుకొని మరల నిద్రించితిని. ఇక స్వప్న కథ వినుడు.

క్రైస్తవుని భార్యపేరు క్రిష్టియానా. ఈ నామము భాషా సాంప్రదాయము ననుసరించి క్రైస్తవురాలు అని వాడబడును. యాత్రికురాలనియు ఆయమకే పేరు. ఆనాడట్లు క్రైస్తవుడు దైవముచే ప్రబోధింపబడి పరుగెత్తి పోవునాడు క్రైస్తవురాలును కంటికగుపించునంతవరకు అతని ననుసరించి పోయినది. ఎలుగెత్తి పిలిచినది. పెద్దగా ఏడ్చినది. గాని యాత్రికుడు మరలి చూడనైన చూడలేదు. ఆ మీదట నామె విచారించుచు తిరిగి వచ్చినది. తన బిడ్డల మధ్యకు వచ్చి నిలుచుండి చింతింప సాగినది. ఔను, క్రైస్తవుడు మాత్రమేమి పిచ్చివాడా ఊరికె పరుగెత్తి పోవుటకు? పైగా భర్త అట్లు పయనమై పోగా భార్య నిర్వికారముగా

నింటియొద్ద కూర్చుండుట యేటిన్యాయము. తానొకర్తుగా దే, నల్గురు పిల్లలున్నారు. వారిగతి యేమిగాను? ఇట్లని విచారించుచు ఎదురుగా దీన వదనములతో నిలువంబడియున్న పసిపాపలను జూచి, వాడిపోయిన పుష్పములట్లు కాంతిని గోల్పోయియున్న వారి లేత ముగములను జూచి, ప్రేమైడె పొంగి పరుగెత్తు దుఃఖము నాపజాలక 'బిడ్డలార! ఏమి చేయుదము? మనము మీ తండ్రివెంటనే బోయి యుండ వలసినది. దౌర్భాగ్యులకు మీకాగతి పట్టవల్యెను. అని విచారించినది. మరి ఓదార్చువారు లేమింజేసి, వారల్లే నిద్రించిరి. ఆ రాత్రి నిద్రలో ఆయమ కొకవింత దృశ్యము గాన్పించినది. యాత్ర చేయునప్పుడు పోవలసిన మార్గములన్నియు గీయుంబడిన పటము ఆ యమ కగుపించినది. అంతలో ఇరువురు భయంకర స్వరూపులు ప్రత్యక్షమై "ఓయీ మన మీ వెడతో నేమి చేయుదము? ఈమెయు క్రైస్తవునివలె యాత్రికురాలై పోయినచో మనకెంత నష్టమోగదా! ప్రపంచము తలక్రిందైనను ఈ యాత్ర కొనసాగకుండ విఘ్నములు కలుగచేయ వలయును" అనుచు గుసగుస లాడుచుండుట గాంచి భయపడి తటాలున లేచి కూర్చుండెను. అప్పటికింకను చాల రాత్రి యుండుటచే చేయునదిలేక మరల పరుండి బలవంతముగా కన్నులు మూసికొనెను. ఈ మారు స్వప్నమున ఆమెకు క్రైస్తవు డగుపించెను. అత డనంత మహిమాన్వితులైన తేజోమూర్తులతో గూడియుండి, పరలోకస్వామిని నిత్యము స్తుతించుచు, సూర్యుని ధిక్కరించు కాంతితో మిలమిల మెరసిపోవుచు ఆనందమున నోలలాడు చుండెను. అంతట క్రైస్తవురాలు నిర్మల చిత్తముతో

మేల్కాంచి, ప్రభాతమున ప్రసన్న భావమై నిల్చియుండ, తలుపులు తెరచికొని లోపల ప్రవేశించెను. ప్రవేశించి 'అమ్మా స్వాగతము, నేను క్రైస్తవుడున్న తావునుండి వచ్చితిని. ఆతడు నిన్ను జూచుటకు ఉవ్విళ్ళూరుచు నీ యాత్ర నభిలషించుచున్నాడు. ఆ పరలోక స్వామి నీ పేర నొకజాబు వ్రాసెను చూడుమ'ని చేతి కందించెను. అందు సువర్ణములతో నిట్లు వ్రాయబడి యున్నది. "బిడ్డా! నీవును నీ భర్త వలె ప్రపంచమును పరిత్యజించి మమ్మును జేరవచ్చుట మాకు మిక్కిలి ప్రియము" ఆ విషయమును చదివిన పిమ్మట నా సుందరమూర్తి 'అమ్మా! నీవును నీ భర్తను అనుగమించి ఆ సూక్ష్మద్వారమున్న మార్గమున నే మనలక నడచిరమ్ము. ఈ శ్రీముఖమును నీ వెంటనే తెచ్చుకొమ్ము. అని చెప్పి మరుగై పోయెను. క్రైస్తవురాలు కొంతసేపు నివ్వెరపడ చూచెను. అంతట తనను తానే చక్కదిద్దుకొనెను.

ఆమీద క్రైస్తవురాలు యాత్రకు సిద్ధమై ప్రయాణమును చక్కబెట్టుకొనుచుండెను. అంతలో ఇరుగు పొరుగు అమ్మలక్కలు పసిబట్టి, మెల్లమెల్లగా నామెయొద్దకు వచ్చిరి. ఎచ్చటికి పోవుచున్నావని ప్రశ్నించిరి. స్వర్గమునకు నిచ్చెన వైచితివిగా అని గేలిచేసిరి. ఆడువారికి అతి సాహసము పనికి రాదు సుమీ అని నిరసించిరి. 'ఆతనికి పట్టిన పిచ్చి నీకును పట్టిన దేమికర్మమమ్మా' అని పరితాపించిరి. నీవున్నను పోయినను ప్రళయ మేమియు లేదు. పాలుగారు పసిబిడ్డలు వీరి నేనట్టేటిలో ముంచెదవమ్మా' అని వారి వాత్సల్యమును ఒలుకబోసికొనిరి. ఆ మాటలు విని క్రైస్తవురాలు 'దయ్యములవలె వాదించెదరేందుకు? మిమ్ములను నేనేమి పిలిచి

తినా తలిచితినా? మీ యింట మీ పనులు మీరు చూచు కొనరాదా? నా జోలి మీ కెందులకు' అని కసరుకొనెను. ఆ యమ్మలక్కలు చిన్నబోయి చేతులు త్రిప్పుచు, మూతులు ముడుచుచు, గొణుగుచు, సణగుచు, చుట్టమని చూడబోయినందుకు దయ్యమయి పట్టిన దట! నీ కంటికి మేమే దయ్యములవలె నుంటిమా మాకే బుద్ధులు నేర్పు నంతటి దాన వైతివిగా? ఐనను మా కెందుకులే, మా దారి మాది, నీ దారి నీది, ఎవరి దారి వారిది, అనుచు అసంబద్ధముగ ఏవేవో ప్రేలుచు మెల్లగా లేచిపోయిరి.

వారిలో దయావతి యను గుణవతికి క్రైస్తవురాలి పైనను, ఆమె పోవనున్న యాత్రపైనను చాల విశ్వాసము కలిగినది. ఆమె ననుసరించి పోవలయునని యాత్రకు సిద్ధపడినది. వారట్లు బయలుదేరి ఆ పట్టణపు పొలిమేరను దాటు నప్పటికి దయావతి 'మన పట్టణములో అంతమంది జనము మిగిలి యున్నారు గదా, వారి గతి యేమిగాను చెప్పుమా' అనెను. 'సర్వేశ్వరుని దయవలన మూర్ఖులను మంద బుద్ధులైన సర్వ ప్రజలను ఉద్ధరింప బడుదురుగాక.' అనుచు క్రైస్తవురాలు దయావతిని ప్రోత్సహించుచు నడచి పోవుచుండెను. అంతలో వారు యాత్రికుడు జారి పడిన ఊబి గుంట యొద్దకు వచ్చిరి. అతడు పడుటను ఎరింగిన వారగుట, జాగ్రత్తగా నా గుంటను దాటిరి. ఐనను “ఒకటి రెండు పర్యాయములు కాలుజారి పడబోయి మరల తప్పుకొనిరి.

వా రేదో మాట్లాడుచునే పోవుచున్నారు. గాని నాకంత స్పష్టముగా వినిపింప లేదు. బహుశ ఆ ద్వారము

వద్ద సేమి చేయవలయునని వితర్కించు కొనుచున్నారు గాబోలు. అంతలో మున్ను క్రైస్తవుడు దాటిపోయిన సూత్న ద్వారము సమీపించిరి. ఆ తలుపుపై గట్టిగా తట్టిరి. ఆ శబ్దమున ఉలికి పడి, పెద్ద కుక్క యొకటి బౌ బౌ మనుచు ప్రక్కనుండి పరుగెత్తెను. ఇది యేమి ప్రాణకు పూవులు తేబోవుచుండ దారిలో బెబ్బులి యెదురైనట్లున్న దే అనుకొనుచు, వారు మరి తట్టుట మానివేసిరి. అంత నా శునకము క్రౌర్యము తగ్గి మెల్లగా నిలువంబడి యుండ యాత్రికు రాండ్రు ధైర్యము తెచ్చుకొని మరల తట్టిరి. అప్పుడు లోపల నుండి మున్ను క్రైస్తవు నాదరించిన సుబుద్ధియే వెలుపలకు వచ్చి, మీ రెవ్వరమ్మా అని ప్రశ్నించెను. వారిలో ప్రాయము చేతను, బుద్ధిచేతను పెద్దయగు క్రైస్తవురాలు 'అయ్యా మేమును పూర్వము క్రైస్తవుడు బయలు దేరిన స్థలమునుండియే' అదే యుద్దేశముతోడనే బయలుదేరి స్వర్గ సామ్రాజ్యమును గూర్చి పోవుచుంటిమి. నే నా యాత్రికుని భార్యనై యున్నందున'.........అని క్రైస్తవురాలు మరి మాటాడక, తడువుకొన జొచ్చెను. సుబుద్ధి సంతోషముతో నెగిరి గంతువైచి, 'బిడ్డా! యాత్రికుని భార్యవైన నీవు మహా భాగ్యవతివి సుమా' అని మెచ్చుకొనుచు, ఆమెను పిల్లలను లోనికి దీసికొనిపోయి ద్వారమును మూశివైచెను. పాపము దయావతి వెలుపలనే నిలిచి పోయినది. నన్నిక లోపలకు రానీయరు గాబోలని ఆయమ్మ విచారముతో నొక్క నిట్టూర్పు విడిచి, నేల కొరిగినది. నాకును పాపమనిపించినది. ఔను యాత్రికురాలు భర్తచే ప్రబోధింపబడి పరలోక స్వామిచే నాహ్వానింప బడి, గదా

బయలు దేరినది. మరి దయావతి యన్ననో తనదైన విశ్వాసముతో విశ్వసించి తనంతనే బయలు దేరినది గదా. అట్టి దయావతి కిట్టి ఉపేక్ష తగని కార్యము గదా. కాని నమ్మి వచ్చిన వారిని ఉపేక్షించుట సజ్జనుల లక్షణము గాదు. యాత్రికురాలు సుబుద్ధితో 'అయ్యా! నా వెంట దయావతి యను సుశీలయును గలదు. ఆమె ద్వారమున కాన అనే నీవల్ల నిలిచి యుండుట......' అని సాభిప్రాయముగా సుబుద్ధి వైపు చూచెను. 'ఓహో వేరొక సుశీలయుం గలదా! పరాకుచే గుర్తింప నైతిని గాకేమి' అనుచు శీఘ్రముగా బోయి తలుపు తెరచెను. దీన వదనమై నిగాశతో నిట్టూర్పులతో మిన్నులు చూచుచున్న ఆ గుణవతిని గాంచి 'బిడ్డా! భయము దేనికమ్మా! రా రమ్మ'నుచు లోనికి దీసికొని వచ్చెను.

యాత్రికు రాండ్రు సుబుద్ధి గృహమును తమ సొంత గృహము నట్లు భావించి స్వేచ్ఛగా మెలగిరి. ఒక మారు వినోద కాలక్షేపములో 'అయ్యా! మొగలి పూవునకు ముల్లుండు నట్లు ద్వారములో ఆ కుక్క యెందుకు? మే మెంతగా భయపడితిమో ఆ పరమాత్మునికే యెరుక' అనిరి. ఈత డిట్లనెను. 'ఈ కుక్క వలని బాధలను నే నెరుంగుదును. అల్లదిగో యెడమ వైపున నున్న మేడను జూడుడు అందు చిర కాలము నుండి మన ప్రభువుపై ప్రతిభటత్వము నుద్దేశించి బెల్జబూబు అనువాడు నివసించుచున్నాడు. వాడు యాత్రికులిట్లు లాభ పడుట కోర్వలేక, కుక్క నొక దానిని బెంచి బెదరింపుల కొరకు దానిని మొరిగించుచుండును. దానికి మొరుగుటయే గాని కరచుట తెలియదు.

మొరిగే కుక్క కరవ దన్న జన వాక్యమును మీరు వినియే యుందురు. కాని అల్ప విశ్వాసులు కొందరు ఆ మాత్రమునకే భయపడి వెనుకకు పారిపోవుదురు. పరలోక పిత తమ క్షుద్ర జీవుల నుండి తన భక్తులను రక్షింపలేడా యన్న జ్ఞానమైనను వారికి లేదు గదా' అని కొంత తడ వూరకుండి 'చాల తడవైనది. అనవసరముగా నిచట కాలక్షేపము చేయనేల? అల్లదే మీరు పోవలసిన దారి' అని చూపించెను. వారును ఆ సహృదయుని తగిన విధముగా వీడ్కొని సాగిపోయిరి.

సజ్జనులకు సదా బాధ గలిగించుటయే తమ విధి యన్నట్లు నానా విధములైన కుతంత్రములను పన్ని, దుర్జనులు సత్పురుషులను హింసించు చుందురు. ముందు చెప్పిన బెల్జబూబునకు సుబుద్ధి ప్రసాదమునకు కాడికట్టుగా కొంత భూమి కలదు. వాడా నేలలో విష వృక్షములను పెంచెను. ఆ చెట్లు విస్తారముగా బెరిగి పోయి సుబుద్ధి ప్రసాదపు ప్రాకారపు గోడపైకి కొమ్మలను జాచెను. ఆ కొమ్మల నిండ విష పూరితము లైన ఫలములు పండి పరి పక్వములై కన్నులకు ఆకర్షనీయములై, నోరూరించుచు, ఆ మీద చేతులకు పని గల్పించు చుండెను. అవి విష వృక్షములన్న సంగతి పాపము మన యాత్రికుల కేమి తెలియును? వారి వెంటనున్న పసి పిల్లలు సంబరముతో వానిని కోసికొని తిని వైచిరి. దాని ఫలత మప్పటి కేమియుం దెలియరాలేదు. అంతట వారు సుబుద్ధి గృహమునుదాటి, ఏడెనిమిది పొలముల పెట్టు పోయిరో లేదో అంతలోనే యిరువురు ధూర్తులు వారికెదురుగా వచ్చిరి. వచ్చి నలు వైపులు పరికించి, తమ్మె

దిగించునట్టి పురుషు లెవ్వరు లేరనియు మగతోడు లేని ఆ స్త్రీల కెదురుగా నిల్చిరి. నిల్చి చేతులు చాచి, విషయ వాంఛతో బలవంతముగా వారిని కౌగిలింప జూచిరి. వారి ఈ విపరీత ప్రక్రియకు ఉలికి పడి యాత్రికురాండ్రు ‘ఛీ! దుర్మార్గులారా! దూరముగా తొలగి పొండు, అని చీదరించుకొని వెనుకకు తగ్గి నిలుచుండిరి. కాని ఆ ధూర్తులు పైపైకి వచ్చి వారి ముఖమున ముద్దిడ జూచుచుండ, యాత్రికురాండ్రు కాలి చెప్పులు విడిచి, హద్దు మీరి ముద్దు కోసమని ముందునకు సాగి సాగి వచ్చుచున్న మూతులపై లాగి కొట్టిరి. ఆ దెబ్బతో నా కాముకులు వేత్రపు వడి నడుము విరిగిన పాము వలె వెనుకకు తగ్గి, శౌర్యము నమసిపోవ బ్రతిమలాడు కొనుచు, మేము మిమ్ము గోచు కొనుటకు రాలేదు కాని ఒక్కమాట. మా మాట మీరు వింటిరా ఓ!’ —అనుచు నేమేమో చెప్పబోవుచుండ యాత్రికురాలు చుర చుర జూచుచు ‘ఆ వింటిమి వింటిమి! చాలు చాలు! ఇక నైనను బుద్ధి కలిగి మీ మార్గమున మీరు పోవచ్చును’ అనెను. కామాంధులకు కన్నులు కానరావు. మంచి చెడ్డలన్న వివేచన మనసే ఉండదు. అందుచే, చేతనా చేతనములను వారు దీనులై యాచింతురు. అని మున్నొక మహాత్ముడు సుభాషితమును రచించెను. ఆ కాముకులును యాత్రికురాలి వాక్యములకు వికృతముగా నవ్వి, ఓసి యెంత గడుసరివే! మాటల చేతనే మమ్ము వెరపింప జూచెదవుగా ? బెల్లబూబు లంటులము సుమీ! మహాత్ములనే అల్లల నాడించిన మహానుభావులము. ఆడుదాని బెదరింపులకు జడిచి ఆవలకు బోవుటయా? ఆహా! చక్కని చుక్కవలె

నున్నావు గదే! ప్రపంచములోనున్న ఆడువారి అందమం
తయు నీలోనే తొణికిస లాడుచున్నది గదే! నీకీ వైరాగ్య
బుద్ధి పుట్టిన దెందుకే! ఐనా ఆడుదాని వైరాగ్యము ఆరు
గడియలకన్న పైన నిలువదులే. నిలిచిన నేమాయె ?
మా కామ వాంఛ తీరుపర్యంతము మిమ్ము విడువము.
ఎవ్వ రడ్డువచ్చిన నేమి' అనుచు మదించిన ఆబోతులట్లు
మరల మీదకు వచ్చిరి. యాత్రికురాండ్రు వారి యుద్ధృతి
కెంతయు భీతిల్లి 'అయ్యో దుర్మార్గులు చంపు చున్నారు.
ఆడువారము దిక్కులేదా' యనుచు ఆ వరచిన ట్లరచిరి.
అప్పుడే సమీపమున నేదో పనిమీద తిరుగుచున్న ఆప
ద్బాంధవుడను మహానుభావుడు ఆయార్తధ్వని విని 'ఓరోరి
యెవరురా దురాత్ములు'నుచు తత్క్షణమే పరుగెత్తుకొని
వచ్చెను. అతనిని జూచి వారిరువురు భయపడి, తోక
ముడిచిన కుక్కలట్లు వెనుకకు దిరిగి చూచుచు బెజ్జబూబు
భవనమునకు పరుగెత్తి పోయిరి. అతడును వారిని కొంతవ
రకు తరిమి 'పరమ దుర్మార్గులార! బ్రతికి పోయితిరి పొండి'
అనుచు వీరియొద్దకు వచ్చెను. క్రైస్తవురాలును 'అయ్యా!
మమ్మాపత్కాలమునుండి రక్షించిన మీ ఋణమును
ఏమిచ్చి తీర్చుకొన గలము' నాకు తోబుట్టువులు లేరుగాని
నీవు మాయమ్మ కడుపున బుట్టిన నెంత బాగుండెడిది
అనెను. అతడును సోదరీ! నన్నింతగా ప్రశంసించెద వేమిటి
కమ్మా! ఇదిగో నా మాట వినుడు. మీరు ఈ మారు
విశ్రాంతి గృహము నుండి బయలు దేరునప్పుడు, పురుష
సహాయము లేకుండ అడుగైనను నడువ వద్దు. మీకు
మేలయ్యెడిని. పోయి రండని తన దారిని తాను బోయెను.

క్రైస్తవురాలు దయావతితో నా యవివేకము వలననే యింత ఆపద వచ్చినదనెను. ఇందు నీ యవివేకమేమి గలదని దయావతి ప్రశ్నింప యాత్రికురాలు చెప్పుచున్నది. మనము వినాశక పట్టణమునుండి బయలుదేరు నాటిముందు నాటి రాత్రి భయంకరమైన స్వప్నము గాంచితిని. అందిరువురు భయంకర స్వరూపులు ప్రత్యక్షమై "ఓయీ మన మీబిడతో నేమి చేయుదము? ఈమెయు క్రైస్తవుని వలె యాత్రికురాలై పోయినచో మన కెంత నష్టమో గదా? ప్రపంచమంతల క్రిందైనను మన మీ యాత్రికొనసాగకుండ విఘ్నము లాచరింప వలయును. అని గుసగుసలాడుట వింటిని వారే యీ ధూర్తులు. అట్టి వీరచర్యము దెరింగియు తగిన జాగ్రత్త లేక వచ్చుట నా యవివేకము గదా? అని చెప్పుచు నడచి పోవుచుండెను. ఆ మీదట వారు వ్యాఖ్యానకుని గృహమును చేరవచ్చుట స్వప్నమున జూచితిని.

ఆ యింటిలోని వారందరు గుంపుగా కూడి మాట్లాడు కొనుచుండ, క్షణముపాటు వీరిపై దృష్టి వారిపై నిలిపి, వారు మాట్లాడు కొనున దేమిటాయని ఆలకింప దొడగితిని. ఏమున్నది, క్రైస్తవురాలు యాత్రికురాలైన సంగతి నేల నాలుగు చెరగుల ప్రాకిపోయి, ఎల్లెడల అట్టుడికి నట్లుడికి పోవు చున్నది. ఇచ్చటను అవే సుద్దులు. అంత యాత్రికురాలు సమీపించి, తలుపు తట్టగా ఎవ్వరో వచ్చిరనుచు పరుగెత్తుకొనివచ్చి, సాధు మతియను విలాసిని తలుపు తెరచెను. తెరచి చూచి ఆ వచ్చిన వారిని క్రైస్తవురాలు గను, తజ్జనముగను నెరింగి చెప్పరాని ఆనందముతో పరు

గొత్తుకొని పోయి, లోపలి వారితో ఆ వచ్చిన దెవ్వరో మీ రెరుంగుదు రటే! యాత్రికు రాలైన క్రైస్తవురాలే సుమా అనెను. అప్పుడు వారందరును సంభ్రమముతో వ్యాఖ్యానకుని జేరి, అల్లదే యాత్రికురాలు మన ద్వారము వద్దనే నిలిచియున్నదని విన్నవింప, నాతడు ఎట్టెట్టూ! క్రైస్తవురాలు యాత్రికురా లైనదిగా! వెదుకం బోయిన తీగ కాలందగిలి నట్లున్నదే! చూచెద రేమి శీఘ్రమే లోపలికి తీసికొని రండి అనెను. అప్పుడే యాదుపడుచులు, ఉత్సాహముబికి తమకంటె ముందు పరువెత్త, ద్వారము నొద్దకు పరుగెత్తి, ఇంకను బయటనే నిలుచుంటి వెందుకమ్మా? రారమ్మని పిలిచి లోనికి తీసికొనిపోయిరి. వ్యాఖ్యానకుడును 'బిడ్డలార! మీకిదె స్వాగతము. ఇందు మీ వలసినన్నాళ్లు మీ యింటి యందున్నట్లు స్వేచ్ఛగా సంచరించి, మా చేయు విందుల నానందింతురుగాక' అనెను.

మన యాత్రికురాండ్రు వ్యాఖ్యానకు నింట విశ్రాంతికై కొంతకాలము నిలిచి పోయిరి. ఆ సమయములో నతడు పూర్వము క్రైస్తవునకు జూపిన వింత దృశ్యము లన్నియు వీరికిని జూపెను. దారిలో వారొకచోట నిలుచుండి, కోళ్లు నీళ్ళు త్రాగుటను గమనించిరి. అవి ముక్కుతో నీటిని పీల్చి కంఠమును పైకెత్తి, ఆమీద మ్రింగు చుండెను. అప్పుడు వ్యాఖ్యానకుడు 'చూచితిరా పక్షిజాతులు గూడ తమ కాహార పానీయాదుల నొసంగు జగదీశునియెడ తమ కృతజ్ఞతను వెల్లడించు కొనుచున్నవి. పరమండలము లోని పితను స్తుతించుట కొరకే, అవి మెడలెత్తు చున్నట్లున్నవి' అనెను.

అతనివెంట వారొక గదిలోనికి బోవ, అచట నొక కటికివాడు గొఱ్ఱెపోతును మెడ గోయుచుండెను. చచ్చువరకును ఆ గొఱ్ఱెయందు ఎగిరిపడుట, భయపడుట, కలవరపడుట ఇత్యాది మరణకాలపు చిహ్నము లేవియును లేవు. అప్పుడు వ్యాఖ్యానకు డిట్లనెను. 'చూచితిరి గదా! మీరును కష్ట సమయములందు గొఱ్ఱెపిల్లవలె నిర్మల మనసుతో ప్రశాంతచిత్తులై యుండవలెను.'

అటు పిమ్మట నాతడు వారినొక తోటలోనికి తీసికొని పోయెను. అందు నానా విధములైన పుష్పములు కన్నుల కరువు తీరునట్లు పూచి, విప్పారి మెల్లమెల్లగా వీచు పిల్ల గాలులలో అల్లనల్లన ఉయ్యాల లూగుచున్నవి. అందులో కొన్ని పుష్పములకు మనోహరమైన రంగులలవడి యున్నవి. మరికొన్ని ఈ రంగురంగుపూలను జూచి, తెలతెల బోయినట్లు తెల్లగా నున్నవి. కొన్నింటికి సువాసన గలిగి యున్నది. మరికొన్ని వాసనలేని పూవులు, ఈ పూవులపైగల యీసుచే గాసిలు చున్నవి. అటువంటి తోటలో గలయ దిరుగునపుడు వ్యాఖ్యానకుం డిట్లు వ్యాఖ్యానించెను. 'చూచితిరి గదా! ఇందలి వాసనలేని, వర్ణములేని పూలు తోటమాలితో 'ఇదేమిటయ్యా మేమిట్లుంటిమి; మరికొన్ని పూవులట్లుండె. అవి చేసిన పుణ్యమేమి? మేము చేసిన పాపమేమి? అని మొరపడవు. పైగా అంచుననున్న పూలు ఇదియేమి? మేమీ ముండ్లకంచె దాపున నెందు కుండవలయును? మాతోడి పూలు వన మధ్యములో నిర్భయముగా నేల కులుకుచుండ వలయును? మమ్ములనుగూడ అచ్చటకు తీసికొని పోరాదా?' అని వానిని పీడింపవు. ఈప్రకృతి తన విశేష

విలాసమను శీలముచే మానవులకు పాఠము నేర్పు చున్నట్లున్నది సుమీ!

అట్లు చూచుచుం బోవుచుండ, వారియెదుట నొక బ్రహ్మాండమైన వృక్షము నలువైపులకు కొమ్మలు చాచి, మోకులు తిరుగని మాత్రముతో నిలిచి యుండెను. కాని వారు దగ్గరకుపోయి చూతురు గదా, కొండ బిలమువలె మొద్దంతయునొక తొఱ్ఱ. అప్పుడతడు 'దీని భావము తెలిసినదా ? పాపాత్ముడు డాంభికుడై ప్రపంచమును వంచించుచు దిరిగినను, లోపల వాని సారమిట్టిదే' అనెను.

అంతట వారొక యిసుక తిన్నెమీదుగా నడచుచు ముందట నొక మంచినీటి చెలమను జూచిరి. అందుండి అప్పుడే యెవ్వరో నీరు తీసి కొని పోయినందున క్రొత్త నీరు ఊరు చుండెను. అప్పుడు వ్యాఖ్యానకుడు యాత్రికు రాండ్రను దగ్గరకుబిల్చి 'ఇచట నొక క్షణముపాటు నిలిచి చూడుడు. ఈ చెలమనుండి యెవరెన్ని మారులు జలములు కొనిపోయినను, అది మరల మరల ఊరుచునే యుండును. ఒకవేళ ఎవ్వరును నీటికి రారేని; అది అంతే యుండునుగాని పొరలి పారదు. దీనినుండి మీరొక పాఠమును నేర్చు కొనుడు. ధన మున్నవారు బీద సాదలకు అవసర మెరిగి దానము చేయుదురేని, వారి కంత కంతగా భగవంతు డనుగ్రహించుచునే యుండును. పాత్రునకిచ్చిన ధనము ఆవున కేసిన గట్టి, పాలైనట్లు ఫలించును. అపాత్రున కిచ్చిన ధర్మము పామునకు పోసిన పాలు, విషమైనట్లు విష మించును.' ఇట్లు ప్రకృతిని వ్యాఖ్యానించు కొనుచు వారం

దరు ఇల్లు చేరుకొనిరి. అప్పుడు వ్యాఖ్యానకుం డిట్లనెను. 'పంది పొరలించిన కొలది, పంకమును విడిచి బయటకు రాదు. మూర్ఖుడును దేహము దృఢమై యున్నన్నాళ్ళు, పాపమున నే పరిభ్రమించు చుండును.'

'స్త్రీలు గడియ కొక విధముగా వింత వింత వస్త్రాభరణములతో దేహము నలంకరించుకొని ముచ్చట పడుచుందురు. ఆముచ్చటతో తమ యాత్మ నలంకరించు కొందురేని వారి కెంతయు మేలయ్యెడిది.' 'మహా నావను నయితము సముద్రమున ముంచుట కొక్క రంధ్రము చాలి యున్నట్లు, పుణ్యాత్ముని నయితము ఘోర నరకమున కీడ్చుట కొక్క పాపము చాలి యున్నది.'

'పాపమునుండి పరమానందము ననుభవింప గోరువాడు, కొర్రలు విత్తి జొన్నలు పండునని యెదురు చూచు మూర్ఖునితో సమానుడు.'

'పాచిపట్టి, గారకొని, మలిన దుష్టమైన మట్టిపాత్రలో నడ్డింప బడిన పరమాన్నము మనకిష్టము గానియట్లు, పాపాత్ములమై యున్ననాటి మన జపతపములు పరమండలములోని పితకును ఇష్టములు గావు.'

'సలహాలను పరులకిచ్చుట మాని, తమకు తామే యిచ్చుకొందురేని, ప్రపంచము చాల బాగుపడును.'

అట్లు కొన్నిదినములు వారు వ్యాఖ్యానకు నింటియందు గడిపి, ఆ మీద నొక నాటి ప్రాతఃకాలమున బయలుదేరి పోవ నుండిరి. అప్పుడు కృపావతియను పరి

చారిక వారిని జలకము లాడించి, శుభ్ర వస్త్రములను గట్ట నిచ్చి సొంపుగా నలంకరించెను. అంతట వారా గృహస్థుని యనుమతి వడసి నిలిచియుండ, నతడు తన పరిచారకులలో బృహత్ పరాక్రముడు అను వానిని బిలిచి, వీరిని సురక్షిత ముగా సుందర మందిరము జేర్చిరమ్మని ఆదేశించెను. అత డును తన పరాక్రమట్లు తళ తళ మని మెరయు కత్తిని కరమున ధరించి, యాత్రికురాంద్రకు రక్షకుడై ముందు నడచెను. ఆ గృహస్థు 'బిడ్డలారా! మీకిదె మేలయ్యెడు మనుచు' దీవించెను. వారట్లు పయనమై పోవుచుండుట స్వప్నమున జూచు చుంటిని. వారేదియో మాట్లాడుచుం బోయిరి గాని, నాకంత స్పష్టముగా వినరాలేదు.

అట్లు పోవుచుండ త్రోవప్రక్కన మూడు కొరత వేయంబడిన శవములు గాన్పించెను. వీరెవ్వరని యాత్రికు రాంద్రడుగ, బృహత్పరాక్రము డిట్లనెను. 'వీరు క్షుద్రుడు, సోమరిపోతు, మూర్ఖనాధుడు ననువారు. క్రైస్తవుడీ దారిని బోవునాడు వీరు సోమరులై నిద్రించు చుండిరి. నేటికి వీరి దుష్కృతము లిట్లు మరణ రూపమున ప్రతి ఫలించినవి' అనెను. వారేమి దుష్కర్మ నాచరించిరి అని అడుగ, నతడు మరియు నిట్లనెను. 'వీరు గోముఖ వ్యాఘ్రములు. యాత్రి కులవలె నటించుచు ఈ మార్గమున బోవు సాధు పురుషు లను మిక్కిలిగా హింసించిరి. పైగా మందమతియను వారి కాంతతో పానము గావించిరి. అట్టి యీ పరమ దుర్మార్గు లకు తగిన శాస్తి జరిగినది.' ఇట్లు సంభాషించుచు బోవుచు వారు కష్ట పర్వతమును సమీపించిరి. అంతట బృహ త్పరాక్రముడు పూర్వము క్రైస్తవు డాకొండను దాటి

పోవుట కెంత ప్రయాసము పడినదియు, కుపరీక్షకుడు, వాని మిత్రుడు మార్గాంతరమున బోయి, యెట్లు నశించి నదియు వివరించి చెప్పెను.

ఆ మీదట వారు పర్వతము నెక్కసాగిరి. కొంత దూరము పోవునరికి చిన్నపిల్లలు తోటకూర కాడలవలె వంగిపోయిరి. అప్పుడు బృహత్పరాక్రముడు వారిని ప్రోత్సహించి లాలించుచు మెల్లగా నడిపించెను. అచ్చటచ్చట చెట్ల నీడలందు కొంచెము కొంచెముగా విశ్రమించుచు, వారు ముందు యాత్రికుడు విశ్రాంతికై నిలిచిన లతామంటపము జేరవచ్చిరి. అందు విశ్రమించి వ్యాఖ్యానకుడు ప్రియపూర్వకముగా నొసంగిన భోజన పదార్థములను భుజించి తృప్తిగాంచిరి. అంత కొంతకాలము గతించిన వెనుక గమనోన్ముఖులై సింహములు నిలిచియున్న స్థలమును సమీపించిరి. అచ్చట నొక రాక్షస జాతివాడు వారి కెదురుగా వచ్చెను. వాడు యాత్రికుల నేకులను సంహరించి, వారి రక్తమును దోసిళ్ళతో కడుపార త్రావి, రుధిర ప్రియుడు అన్ననామమును ధరించెను. అట్టి ఛండాలుని గాంచి, యాత్రికురాండ్ర రక్షకుడు కత్తినిదూసి ఝళిపించుచు నిర్భయముగా ముందునకు నడచెను. రాక్షసుడును ఎదురు నడచి కనుబొమలు చిట్లించుచు, "ఓరీ! నన్ను జూడు, నా పరాక్రమమును జూడు మనుచు స్త్రీలను వెంటబెట్టుకొని వచ్చుచుంటివా? ఈ ప్రదేశము నే నాక్రమించినది తడవుగా, నిచ్చట నా యాజ్ఞలేక ఆకైనను గదలదే? మిమ్మందర నిప్పుడే వధించి, మీ వేడి నెత్తురులతో సంతృప్తి

జెందెదగాక." అనుచుండ 'ఓరీ దుర్మతీ! నీ యాట లిచట జాగవు.' అనుచు బృహత్పరాక్రముడు కత్తితో వాని నొక్క చరుపు జరిచెను. దానితో రుధిర ప్రియుడు వెల్లికిలం బడి, బాణముతో గొట్టబడిన పక్షివలె తన్నుక లాడెను. 'నా పాలములోనే నన్ను గొట్టెదవటరా' యని ఏమేమో వాగుచుండ 'ఓరీ! ఛండాలుడా! ముందు నీవు యాత్రికు లను నిర్దయుడవై చంపలేదేమి? నీకును అదియేగతి' అనుచు బృహత్పరాక్రముడు వానిని మరల చరచెను. మరివాడు పైకి లేవనే లేదు. అంతట వారు సింహములను సమీపిం చిరి. ఇచ్చట యాత్రికురాలి పిల్లలు మిక్కిలిగా భయపడిరి. వారి తల్లి చీరకొంగు నంటిపెట్టుకొని యుండిరి. అతడును నేనుండ మీరు భయపడనేల? ఈ సింహములు బంధింప బడి యున్నవి గాన, మనకెట్టి అపాయను లేదనుచు దాటి పోయెను.

వారట్లు నడచిపోయి జాగరూకుని తలుపు తట్టిరి. అర్ధరాత్రమున వచ్చిన వీరెవ్వరు చెప్పుమా యనుచు నా జాగరూకుడు లేచివచ్చి తలుపు తెరువ, బృహత్పరాక్ర ముడు యాత్రికురాండ్రను జూపి, 'మా స్వామి యనుమతిపై వీరినిందు గొనివచ్చితిని. మరి సెలవు. నేనిక పోయివచ్చెద' ననెను. ఆ గృహస్థు 'ఓయీ ఇంత తొందర యేల? కొంత కాలమిచ్చట విశ్రమించి తనుపరి నిదానముగా బోవచ్చును లెమ్మ'నెను. యాత్రికురాండ్రును ఇచటనుండియే మరలి పోవుచుంటివా? నీవు వెంటలేకున్న మా కేది దిక్కు?' అని దీనముగా ననిరి. అతడును 'అట్లుగాదు. మా ప్రభువు నన్నింతవరకే వెళ్ళి రమ్మనెను. ప్రభువు నాజ్ఞ యయ్యె నేని

మీ వెంట చివరివరకు వచ్చుటకు నాకెట్టి అభ్యంతరమును లేదు.' అనుచు వారి సెలవు తీసికొని వెనుదిరిగి పోయెను.

అంత జాగరూకుడు అమ్మా! మీ రెవ్వరని ప్రశ్నింప యాత్రికురాలు తమ యుదంతమును విన్నవించెను. దానితో నతడు పూర్ణిమనాటి సముద్రమువలె పొంగిపోయి, గొంతెత్తి, వినయవతియను కన్యను బిలిచి, 'ఇదిగో! క్రైస్తవురాలు మిత్రురాలితో సహా బిడ్డలను వెంటబెట్టుకొని యాత్రికురాలై వచ్చినది. చిత్రముగ దే? యనుచుండ వినయవతి నిలుచున్న పాటుననే పరుగెత్తి లోనికి యాడువారితో నా విషయ మెరింగించెను. వారును ఎట్లున్నవారట్లే తటాలున ద్వారమువద్దకు పరుగెత్తుకొని వచ్చిరి. ఆ వచ్చిన వారందరును ఈ వచ్చినవారిని సగౌరవముగా లోనికి ఆహ్వానించి అన్న పానాదులచే నాదరించిరి. వారా యింటిలో కొన్ని రోజులపాటు నిలిచిరి. పూర్వపు వివేకవతి, భక్తిమతి, ధర్మావతియను కన్యకలు అక్క చెల్లెండ్రవలె వీరితో కలసిమెలసి యుండిరి. ఒకనాడు వారు క్రైస్తవురాలి కుమారులను బుజ్జగించి, తమయొద్ద కూర్చుండ బెట్టుకొని, వారి విద్యా బుద్ధులను పరీక్షించుచుండ, వారిలో పెద్దవారైన జోసెఫాత్తు, జాషువా అనువార లిట్లని సమాధాన మిచ్చిరి.

వివేకవతి : నాయనా నిన్నెవరు కలిగించిరి?

జో : పిత, సుతుడు, స్పిరితుసాంక్తు అను త్రిత్వైక సర్వేశ్వరుడు.

వి. వతి : మంచిది నిన్నెవరు పోషించి రక్షించుచున్నారో నీ వెరుంగుదువా?

జో:- 'పరమండలములోని దివ్యపిత.'

వి. వతి:- పరమండలములోని పిత భూలోకములో నున్న నిన్ను రక్షించు టెట్లు?

జో:- 'తన వరప్రసాదముల వలన'.

వి. వతి:- 'సుతుడైన సర్వేశ్వరుడు రక్షించిన దెట్లు'?

జో :-'తన జీవమును రక్తమును బలియిచ్చి మనలను రక్షించెను'.

వి.వతి :- 'ఐన స్పిరితు సాంక్తువైన సర్వేశ్వరుడు మనలను రక్షించునదెట్లు'?

జో:- 'తన దివ్యజ్ఞానముచేత.'

వి. వతి:- 'నాయనా, నీకీ వేదవిషయములు మీ తల్లి చిన్ననాడే ఉగ్గుపాలతో బోసినట్లున్నది. ఈమారు జామువా సమాధాన మిచ్చుగాక. మానుజుడనగా నేమి?'

జా:- 'మంచిచెడ్డ లెరింగిన వాడును, దేవునిచే సృజింప బడిన వాడునునైన ప్రాణి. దేహాత్ముల సంయోగముచే తదితర జంతు జాలమునకన్నను అతడు విశిష్టుడై యున్నాడు.'

వి. వతి:- 'దేవుడు మనలను రక్షించెననుటలో అర్థమేమి?,

జా:- పాపముచే బంధితులై దురవస్థలోనున్న మనుజులను దేవుడు రక్షించి ఉద్ధరించె ననుట.

వి. వతి:- నిన్నిక నడుగ నక్కరలేదు. ఈమారు జోసేపుడు సమాధాన మిచ్చుగాక. మోక్షమనగా నేమి?

జో:- 'దేవుడు సదా నివసించునదియు, మహానందమును, దుఃఖదూరమునైన ప్రదేశము'.

వి వతి :- 'నరక మనగా నేమి'?

జో:- 'పిశాచములు సదా నివసించు నదియును, దైవ రాహిత్యమును, దుఃఖ భూయిష్ఠమును, దుస్సహము నైన స్థలము'.

వి. వతి:- 'మంచిది. ఈమారు మీ చిన్న తమ్ముడు రాఖేలుడు సమాధానము చెప్పగలడేమో చూతము. దేవునికంటె ముందున్న పదార్థ మేమైనం గలదా'?

రాఖేలు:- నిన్నం దేహముగా లేదు. ఎందుకనగా "సర్వేశ్వరుడు ఆరు దినములలో జల భూమ్యాకాశములను వాని లోనుండు సమస్త జంతు జాలమును సృష్టించెను" అని వ్రాయబడి యున్నది. ఆ యారు రోజుల లోనిదైన మొదటి రోజువరకును సర్వేశ్వరుడు తప్ప మరెవ్వరును లేరు.

వి. వతి:- 'సువిశేష మనగా నేమి'.?

రా:- 'గ్రంథ రూపమునయున్న భగవద్వాక్యము.'

వి. వతి:-ఆ 'సువిశేష గ్రంథమంతయు నీ కర్థమాయి నదా'.?

రా:- 'లేదు; చాల భాగ మర్థము కాలేదు.'

వి. వతి:- మరి యా భాగమును జదువు నప్పుడు నీవేమి చేయుదువు.?

రా:- 'జ్ఞాన స్వరూపుడైన భగవంతుని తెలియుట అనునది నాకెంతవర కవసరమో అంతవరకును తెలుపు మని ప్రార్థింతును.'

వారి సమాధానములకు వివేకవతి సంతోషవతియై క్రైస్తవురాలిని 'వేద విషయములలో బిడ్డలను తీర్చి దిద్దితి వమ్మా' అని మెచ్చుకొనెను.

ఆనాడు, వ్యాఖ్యానకుని గృహమునుండి వచ్చునాడు బెల్లబూబు పెంచిన విష వృక్షఫలములను ఈ బాలురు భక్షించిరని చెప్పియుంటిని గదా! దాని ఫలితము నేడు గన్పించినది. జాగరూకుని యింట వారందరును జబ్బుపడి బల్లులవలె మంచములను గరచుకొని పడియుండిరి. జాగరూకుడు తన మిత్రుడైన ప్రజ్ఞానిధియను వైద్యుని బిలువ బంపెను. అతడును తత్క్షణమే వచ్చి బాలురను పరీక్షించి జీర్ణముగాని పదార్థమేదియో ఉదరమున నున్నట్లు గుర్తించి ఔషధముచే దానిని గ్రక్కించెను. దానితో వారు వ్యాధి నుండి విముక్తులైరి.

అప్పుడు యాత్రికురాలు బృహత్పరాక్రముని తమకు మార్గరక్షకునిగా బంపుమని వేడుకొనుచు, వ్యాఖ్యానకుని పేర నొక జాబు వ్రాసెను. జాగరూకుడు దానిని తన భృత్యునిచే బంప వ్యాఖ్యానకుడును వల్లెయని ఆ వీరుని వెంట పంపెను. బృహత్పరాక్రముడును తన ఆయుధములతో వచ్చి జాగరూకునికి గానిపించుకొనెను. అంతట వారా గృహస్థుని సెలవు తీసికొని ముందునకు నడచి పోవుచుండ, ఆ యింటి వారందరును చాల దూరము వచ్చి సాగనంపిరి. అప్పుడు దారివెంట చక్కని సంగీతము విన వచ్చినది. ఈ పాడువారెవ్వరని యాత్రికురాలడుగ 'మా భూములలో సంచరించు పక్షులు; ఉబుసు పోకకు అరుచు చున్నవని' వివేకవతి యనెను. ఆమీద వీరిని వీడ్కొని వారు సాగిపోయిరి. పోయి పోయి, మున్ను క్రైస్తవునకు భేతాళునకును భయంకర యుద్ధమైన భీకరారణ్యమును సమీపించిరి. ఈమారు మరల ఘాత భేతాళ, శాకినీ,

ఢాకినీ, పిశాచ గణములలో నెవ్వరైన యుద్ధమునకు వచ్చెదరేమో నని చూచితినిగాని, భేతాళుని పరాజయానంతరము ఆ యరణ్యమున అట్టివా రెవ్వరును ఉన్నట్లే లేదు. నాడు భేతాళుని జయించిన విజయ ప్రశస్తికై క్రైస్తవుడు నిల్పిన స్తంభమునుగూడ వారు చూచిరి. అంతట వారా యరణ్యమును దాటి, మృత్యుచ్ఛాయ యనబడు లోయగో నడచిపోవుట గాంచిరిని.

ఆ కోనలో మృత జీవులు అంగలార్చుచు, ప్రలాపించుచు బోరు బోరు మని రోదనము గావించు చుండిరి. యాత్రికరాండ్రు భీత హృదయులై శాంతిదప్పి, కలవర పడుచుండ, బృహత్పరాక్రముడు 'నేనుండ భయము మీ యందుండు టెట్లు? నన్నంటి రండని' హెచ్చరించెను. చిన్న పిల్లలు అతనికిని స్త్రీలకునుమధ్య నడచు చుండిరి. అట్లు పోవుచుండ అడుగున సొరంగమున్నట్లు భూమి మెల్ల మెల్లగా క్రుంగ జొచ్చెను. వాన కారులోని చౌటి నేల యందట్లు, ఇచట వేసిన యడుగు అల్లంతట బడుచుండెను. అచ్చటి వృక్ష శాఖలనుండి భయంకర సర్పములు మరి యూడలవలె క్రిందికి వ్రేలాడుచు, నాలుకలు గీటుచు, బుస పెట్టు చుండెను. మరి కొంతదూరము నడిచి, మార్గము సమీపమున నేదియో భయంకర స్వరూపము నిలిచి యున్నట్లు గుర్తించిరి.

ఆ వికృతాకారముగాంచి పసి పిల్లలు కెవ్వమని కేక వేసిరి. స్త్రీలును ధైర్యము సెడి మూడడుగులు ముందు నకును, ఆ రడుగులు వెనుకకు వేయు చుండిరి. అట్టి వారికి ధైర్యముసెప్పి బృహత్పరాక్రముడు మించి, దీపించిన పరా

క్రముతో ముందునకు నడచి, ఆ భయంకర ప్రాణి నిల్చి యున్న స్థలమునకు వచ్చి చూచునుగదా! మెరపువలె తటాలున నదృశ్య మయ్యెను. ఔను "కనుపించిన దయ్యమునకు ధైర్యముగా ఎదురునడిచి పోయెదరేని అది తప్పక వెనుదిరిగి పోవును" అన్న పురాతనోక్తి యేలతప్పును?

అట్లు మరికొంత దూరము పోవునరికి, అరణ్య మంతయు ప్రతి ధ్వనించుచుండ, మేఘము వలె గర్జించుచు మృగరాజమైన సింహరాజ మొకటి వారిని వెంబడించెను. దానిని గాంచి బృహత్పరాక్రముడు వారి వెనుకకు వచ్చి, కత్తిని వాటముగా బట్టి, బాహువు సారించి, ఒకకాలు ముందుంచి, రౌద్రము మూర్తిమంతమైనట్లు వచ్చుచున్న సింహము వైపు తీక్షణముగను, దారుణము నైన వీక్షణములను మరల్చెను. ఆ చూపులలో నెంతటి మహాశక్తి విద్యుత్తు వలె ప్రవహించు చున్నదో గాని, సింహము సాహసము మాని మెల్లగా నిలుచుండెను. కొంచెము సేపట్లు నిలుచుండి బృహత్పరాక్రముని లక్షించి చూచి, వాని పరాక్రమున కోడిపోయినట్లు, వెనుకకు మరలి మెల్లగా నడిచి పోయెను.

వారా లోయ దాటబోవునరికి, ఒక గుబురు పొద వెలువడి గొలియాతుడను గోలాం గూలుడు పిశాచ ప్రేరితుడై వారి కెదురు వచ్చి, దూరా తెరువరిని గాంచి మర్కట చేష్ట లుట్టిపడ ఇకిలించి, సకిలించి, వెకిలి నవ్వులు నవ్వి ఎక్కరించి, కొక్కరించి, పండ్లు పటపట కొరికి, పైకెగిరి క్రిందపడి, చిందులు దొక్కి, తేలు కుట్టిన కుక్క మొరుగుడు వలె దారుణముగా నరచెను. వాని వికృతపు చేష్టలకు జడిసి ఆ యువజ[illegible] సబలులై, ప్రజ్ఞలులై, మహాబలులై యున్న తమ

రక్షకుని మరుగున నొదిగియుండ, గోలాంగూలము 'ఓరోరీ ఎంతటి దురాత్ముడవురా! నే నెన్ని మారులు వలదన్నను నీవీ వ్యాపారమును మానవైతివిగా? మా ప్రభువైన బెల్జబూబుని సామ్రాజ్యమునుండి నీ వీ వెర్రి మానవులను అపహరించుకొని పసులవలె తోలుకొని పోవుచుంటివా? పోయి మెచ్చుట కైన అమ్ముకొందువా యేమి'? అనెను. బృహత్ పరాక్రముడు ఓరీ మర్కటాధమా! కొమ్మలలో తలక్రిందులై వ్రేలాడు చుప్పనాతీ! కోతీ! నోటికి వచ్చినట్లు ప్రేలితివి గాక! ఈ పుణ్య మూర్తులను ప్రభువు సామ్రాజ్యమున సురక్షితముగా చేర్చబోవుట నీ వెరుగవా యేమి. ఈ మార్గమున వచ్చుచు బోవువాడను. నిన్నుపేక్షించి యున్నాళ్లు బ్రతుక నిచ్చినందులకా నీ విట్లు విజృంభించితివి? నీకు వినాశ కాలము దగ్గరించుటచే నిట్లు విపరీత బుద్ధి పుట్టినది. అనుచు తన కరవాలముతో దాని వాలమును తెగ నరికెను. అప్పుడా గోలాంగూలము తోకనుండి ఎర్రని నెత్తురులు చిప్పించి దారలై కారుచుండ, అవ్వాయి చువ్వ వలె నెగిరిపడి పెడబొబ్బ లిడుచు, చక్ర బాణము వలె గిర్రున దిరిగి గబాలున నతని కాలు కరచెను. అతడును జాడించి కాలు విదిలించుకొని, కుప్పించి మీది కెగియు కోతిని, యీటెతో పందిని బొడిచినట్లు, కత్తితో ఉదరమున బొడిచెను. ఆ పోటు గాటముగా నాటుటచే దాని దేహమును చీల్చుకొని కత్తి మొన వెలుపలికి వచ్చెను. దానితో నా దయ్యపు చెలికాడు కుయ్యిలిడుచు, వెల్లికిలబడి, కాళ్లు ముడిచి, కంటివెంట నీరు కార్చుచు, బోసినోరు విప్పి దుర్భాషలాడుచుండ బృహత్ పరాక్రముడు కత్తిని లాగి 'ఓదుష్టా

మీ దయ్యమును జూడబొమ్మా!' యనుచు దాని కంఠమును కత్తరించి, కత్తికి గ్రుచ్చి మీదకెత్తెను. ఆ యాత్రికురాండ్రతని పరాక్రమమునకు నివ్వెరపడి చూచుచుండిరి. యాత్రికురాండ్రనేల? కల గాంచుచున్న నాకు నయితము అచ్చెరువు పెచ్చు పెరుగ ముచ్చెమటలు పోసినవి.

అంత వారొకింత తడవు విశ్రమించి గోలాంగూలముతోనైన పోరాటము వలని యారాటమును బాపుకొనిరి. జాగరూకుడు వారికొసంగిన భోజన పదార్థములను భుజించి సంతుష్టులైరి. మరల పయనమై కొంతదూరము పోయి, ఒక రావి చెట్టుక్రింద నిద్రించుచున్న వృద్ధుడై యున్నవానిని గాంచి, ప్రబోధించి నిద్రలేపిరి. అతడును తుళ్లిపడి లేచి కలవరపడి చూచి, వారును యాత్రికులగుట నెరింగి సంతోషముతో సంభాషించెను. అతని పేరు సత్యకాముడు. వినాశక పట్టణమునకు దాపుననే యున్న మూర్ఖ నివాసమను మహా నగరమునుండి అతడు యాత్ర బోవుచుండెను. ఆ వచ్చిన వారిని క్రైస్తవుని పత్నిగను ఆతని పిల్లలుగను, వారిమిత్రురాలిగను, మరివారి రక్షకునిగను తెలిసికొని, సత్యకాము డాశ్చర్యపడెను. వారా విషయములు ఈ విషయములు నాకు చెప్పుటకును, మీకు వినుటకును సంతోష దాయకములు గానివి, ఏవేవో మాట్లాడుకొనుచు నడిచి పోయి పోయి, ఒక సత్రమును జేరిరి.

ఆ సత్రము సౌజన్య మూర్తియను వానిది. అతడును అకస్మాత్తుగా వచ్చిన ఆ యాత్రికుల నాదరించి, వారికి బస నేర్పాటు గావించెను. వంటలవానిని బిలిపించి వారికి

వలయు భోజన పదార్థములను సిద్ధము చేయించెను. ఆమీాద వారదంరు నొకచో గూర్చుండి భుజించిరి. ఆ నత్రమున వారు కొన్నాళ్లుండిరి. ఒకనాడొకచోట తీరికగా గూర్చుండి సౌజన్యమూర్తితో 'అయ్యా! యిదిగో నమస్య ఫూరింపు మ'నిరి. "ఉన్మత్తుడనుచు ప్రజలచే నుపేక్షింపబడియును ధన ధాన్యముల దినదిన ప్రవర్ధమానుడగు వాడెవడు? సౌజన్య మూర్తి యిట్లనెను. తనకు కలిగినదానిని లేదనక బీదసాద లకు నిచ్చు వరదాతయే వాడు.

ఒకనాడు సౌజన్యమూర్తి యిట్లనెను. 'అయ్యా! నీ బృహత్ పరాక్రమముతో నొక నత్కార్యమును గావిం పుము. ఇచ్చటకు దాపున కొండ బిలములో బృహద్బలు డను రాక్షసు డున్నాడు. వాడు యాత్రికులను పట్టి బం ధించి హింసించి క్రూరముగా వధించు చున్నాడు. నీ పరా క్రమము ముందు వాని బలము సూర్యుని ముందు దీప మట్లు వమ్మయి పోగలదు. కావున వానిని వధించి రానున్న యాత్రికుల నుద్ధరింపుము.' దాని కతడు వల్లెయని తన కవ చమును ధరించి, కత్తిని చేతబట్టి పరాక్రమము మెరసి, రాక్ష సుడున్న గుహ వద్దకు బోయెను. అతనితో కూడి వారం దరును నడిచి పోయిరి. రాక్షసు డప్పుడే దుర్బలుడను యాత్రికు నొక్కని బట్టుకొని తన పరివారమును బిల్చి ఓరీ శుంఠలారా! నేనై పోయి యాత్రికుని పట్టుకొని వచ్చు వరకును మీారేమి చేయుచుంటిరిరా? మొన్న గుం పెడు మందిని దెచ్చి కూర గావించి మీా కందరకును వడ్డించితిని కదా? ఆ మనుష్య మాంసమును దిని మత్తెక్కి మైమరచి గుర్రుపెట్టి, నిద్ర పోవుచుంటిరి గాబోలు! మీాకిదే

పోగాలము దాపురించినది. ఖడ్గమును గొనిరండి ఈ మనుష్య పశువును ముక్కలు ముక్కలుగా గోసి పంచుకొందము అని తీర్మానించి పల్కుచుండెను. అంతలో గుహాద్వారమును జేరి నిలుచున్న బృహాత్ పరాక్రముని గాంచి వాడు అంగడిపై మిఠాయి గాంచినప్పుడట్లు పండ్లు పులియుచుండ అద్దిరా మనుష్యా! నీ బుద్ధికి మెచ్చితిని. వంటయింటికి కుందేలు వచ్చినట్లు నా గుహాను వెదకుకొని వచ్చితివి అనుచు లేచి వచ్చెను. దాని కతడు 'ఓరీ రాక్షసా! వంటయిల్లు కుందేలు సొచ్చెనని సంబరపడితివి. కాని, కప్ప తానున్నది సర్పము పడగ నీడనని తలంపక ఎగిరి పడును సుమీ' యనెను. ఆ మాటలకు వాడు ఆఁ యేమంటివి? నన్నే ధిక్కరించెదవుగా? అనుచు పండ్లు పటపట కొరుకుచు ఎదురుగావచ్చి బృహాత్ పరాక్రముని రొమ్ముపై బొడిచెను. దాని కతడు తోకదొక్కిన త్రాచువలె మండిపడి, రాక్షసుని వక్షస్థలమున నొక్కతన్ను దన్న, వాడు వెల్లకిలంబడి మూర్ఛబోయెను. మరికొంత సేపటికి తెప్పరిల్లి రొప్పుచు లేచివచ్చెను. అప్పుడు బృహాత్ పరాక్రమ బృహాద్బలులకు పోరు ఘోరమై చెల్లెను. బృహాత్ పరాక్రముడు కొంతసేపు తన ప్రత్యర్థి బలమును పరీక్షించి, పందా! నీకైద వందులకని వాని డొక్కలో కత్తితో బొడిచి లాగెను. దానితో నెత్తురులుగారుచుండ, ప్రేవులు బయటకు వచ్చుచుండ, విలవిల తన్నుకొనుచు, భీకరముగా నార్భటించుచు, నా రాక్షసుడు నేల కొరిగెను. అతని పరాక్రమమునకు యాత్రికురాండ్రు సౌజన్యమూర్తియు వెరగందిరి. ఆ దుర్బలుడను యాత్రికుని రక్షించి విడిపుచ్చి మరలి వారు ఇం

టికి వచ్చిరి. ఆమీాద నొకనాడు సౌజన్యమూర్తిగొయొద్ద సెలవుతీసికొని ముందునకు నడచిపోవుచుండుట గాంచిరి.

వారు ముందుపోవుచుండ దుర్బలుడు తన దుర్బలత్వమునకు దోడుగా మందగమనుడగు వానిని తోడుచేసికొని, వారివెనుక నిదానముగా నడచిపోవుచుండెను. వారట్లు నడచి నడచి డాంబికద్వయము డంబముతో నేలు డాంబిక పురమును జేరబోయిరి. ఆ దుర్మార్గుల సమాచారము నెరింగిన వాడగుటచే బృహత్ పరాక్రముడు తనవారిని ముందుగనే హెచ్చరించి, అచ్చటనున్న తన మిత్రుడైన సుహృన్మతి యనువాని యింట బసచేసెను. అతడును తోబుట్టువులనట్లు వారి నాదరించి పెద్ద విందుచేసి మధురములైయిన వంటకములతో వారలను సంతృప్తులను గావించెను. అంతట కొంత దడవు వారా పట్టణపు పరిజనులనుగూర్చి ముచ్చటించిరి. కాని ఆ యూరి ధూర్తులు విశ్వాసుని సంహరించిన నాటినుండియు ఆ పుణ్యాత్ముని రక్తము వారిపై పగగొనుటచే వారిలో చాలమంది బలహీనులై, చీలికలై, చికాకులై, చెల్లాచెదరైరి. మరికొందరు మనస్సు మార్చుకొని సాధువులైరి. ఎట్లయిన నేమి యాత్రికుడు పోవు నాటికి కొద్దిగానైన లేని మంచితనము, యాత్రికురాండ్రు పోవునాటికి ఆ పట్టణమున కొంతవరకు గాన్పించుచుండెను. ఆనాటికి వారు సుహృన్మతి యింటనుండి మరునాడు ఆ పట్టణమును దాటిపోయిరి. వారి నెవరుగాని ప్రతిఘటింపనే లేదు. అట్లు పోయి యాత్రికులను మోహపరచు బంగారు గనియొద్దకు వచ్చిరి. కాని అప్పుడున్న కౌటిల్యు డిప్పుడా గనియొద్ద గానరాలేదు. అంతట వారు మరికొంత దూరము

నడచి, ఒక తోటను సమీపించిరి. అచ్చట మధుర ఫలము లతో ఆకలిదీర్చుకొని మరికొంత దూరముపోయి, కర్కోటకుని స్థానరమును జేరిరి. అంతట వారు స్త్రీలను చెట్టునీడక్రింద కూర్చుండ నియమించి వెంటనంటివచ్చు మందగమనుని, దుర్బలుని వారికి రక్షగా నియమించి, బృహత్పరాక్రముడు సత్యకాముడు కర్కోటకుని సంహరించి వచ్చెదమనిచెప్పి పోయిరి.

అట్లు వెళ్లి, ఆ దౌర్భాగ్యుని గృహమును జేరి బాహ్య కవాటమును గట్టిగా దట్టిరి. ఆ చప్పుడువిని కర్కోటకుడు తనభార్య కర్కోటకి యనునది వెంట నంటిరా సబ్బురపడుచు వార్ధక్యముచే నడవలేక నడవలేక ముసలి యేనుగువలె నడచివచ్చి తలుపు తెరచెను. వారిని గాంచి వీరు 'ఓరీ! దుర్మతీ నే నిదే బృహత్పరాక్రముడను; యితడు నామిత్రుడు సత్యకాముడు. నేటితో నీ రోజులు చెల్లి పోయినవి. శీఘ్రముగా యుద్ధ సన్నద్ధుడవై రమ్మనిరి. ఆమాటలకు వాడదరిపడి, హుంకరించి, మీసముదువ్వి, రోసము దెచ్చుకొని, నేను ముసలివాడ నైననేమి? మీరు మనుష్యులగుటచే నన్ను గెలవలేరు, అని పొట్టేలు కొండను డాకినట్లు కన్నులు మూసికొని బృహత్ప రాక్రమునిమీదికి పోయెను. అతడును ఆ బడుగు నెత్తి, బంతిని విసరినట్లు విసరి నేలకు గొట్టెను. ఆదెబ్బతో వాడు నెత్తురులు గ్రక్కుచు ప్రాణములు విడిచెను. వాని దుర్గతికి భయపడి వాని భార్య పరుగెత్తుచు, మున్ను యాత్రికులను వంచించుటకు తాము త్రవ్విన కూపములో తానే పడిపోయెను. అంతట వారు ఆరాక్షసునిచే బంధింపబడిన యాత్రికులను చెర విడిపించిరి. వారిలో

కొందరు వీరి ననుసరించి వచ్చిరి. ఆమీద వీరు యాత్రికు రాండ్రితో గలసి సాగిపోయి, ఆహ్లాద పర్వతములను జేరిరి.

అచ్చటనున్న మంచిగొల్ల వాండ్రు వీరి కెదురువచ్చి, స్వాగతమిచ్చి తమ నివాసములకు దోడ్కొనిపోయిరి ఆ పర్వతములమీద వారును వీరును కలసిమెలసి స్వేచ్ఛగా దిరుగాడిరి. అంత గొల్లలు తమయాచార ప్రకారము వీరికి గొన్ని వింత దృశ్యములను జూపిరి. ఒక్కచో నొకడు తిరికగా గూర్చుండి, కుక్కతోకను సంకర నీయుచుండెను. కాని వాడు విడిచిన మరుక్షణమునసే తోక కొడవలివలె వంకర దిరుగు చుండెను. ఇదేమిటని యాత్రికులడుగ మెవరు లిట్లనిరి: 'తామున్నది దుర్మార్గమున నని తెలిసియు' దుర్మార్గమున నే నడచు దుర్మార్గులను మనస్సుత్రిప్ప జూచుటయు నిట్టులే వ్యర్థ మగును. పూర్వము మనరక్షకుడు ఫరిశేయులకు బోధించుటలో బడిన శ్రమంతయు నీ కుక్కతోకను చక్కజేయుట యందువలె వ్యర్థమై చనెను. మీద వారొకటి రెండునా ళ్లచటనుండి, గొల్లలను వీడ్కొని సాగిపోయిరి.

అట్లు పోవుచు నొక్కచో మేన నెత్తురులు గారుచుండ చేతికత్తితో నిలుచున్నవానిని, అప్పుడే ముగిసిన పోరాటమువలని యారాటము దీరనివానిని, ఒక్కనిం గాంచి 'నీవెవ్వడవు? ఇట్లేల నీమేన నెత్తురు లోలుకు చున్న'వని ప్రశ్నించిరి. అందు కతడు 'నన్ను ధర్మవీరు డందురు. నేను స్వర్గ సామ్రాజ్యమునుగూర్చి యాత్రికుడనై పోవు చుంటిని. ఇచ్చటికి వచ్చు నప్పటికి ధూర్తత్రియు మెదురుగావచ్చి ప్రశ్నత్రయముతో నన్ను నిరోధించిరి. అవి (1) నేను

వారిలో చేరుట (2) లేదా వెనుకకు తిరిగిపోవుట (3) కాదేని వారిచేతులలో చచ్చుట. నేను మూడింటికిని సమ్మతింప నైతిని. అందుకా చోరులు పంప్లుగొరిక, క్రూరులై సిరులవలె నటించుచు, ముగ్గురు నొక్కుమ్మడిగ నామీద పడిరి. వారు గావించిన గాయములచే నామేన రక్తము గారుచున్నది. మరి నా కావించిన గాయములచే వారి మేనికండలు క్రొవ్వులు ప్రేవులుకూడ జారివచ్చుటచే, మరి నిలువజాలక పలాయన మంత్రమును పఠించిరి. వారిప్పుడే పరుగెత్తిరిగాన రెండుమూడు చేలపట్టుననే యుందురు. అప్పుడు బృహత్పరాక్రముడు ధర్మవీరుని మెచ్చుకొనుచు 'ఓయీ! నాడు సాంసోనుడు గార్ధభ తలపుర్రెతో శత్రువులను చీల్చి చెండాడినట్లు నేడు నీవును చేతికత్తితో ధూర్తులను పారదోలితివి. ఏదీ! నీ ఖడ్గము నొకమారు చూడ నిమ్మనుచు చేతికి దీసికొని చూచి, దాని పదునున కాశ్చర్యపడి యిదసి యెక్కడదన, నతడును దీనిని జెరుసలేము నగరమున జేయించితి ననెను. నీ వేయూరి వాడవని యడుగ, ధర్మవీరు డిట్లనెను. 'వినాశక పట్టణమునకు వెలుపలనున్న అంధకార నగరము మా నగరము. ఆ పట్టణమున కొకనాడు సత్య భాషనుడను సాధు పుంగవుడు వచ్చి, క్రైస్తవుని యాత్రాంతమును వినుపింప విస్మయము పడితిని. ఆమీద నొకటి రెండు నాళ్లు తర్కించి వితర్కించి నేనును యాత్రికుడ నైతిని.' అతని సమాచారమునకు సంతోషించి బృహత్పరాక్రముడు 'ఓయీ! ఆ క్రైస్తవుని భార్య యిదే యాత్రికురాలు, వీ రిదె వారిపుత్రులు' అనుచు వారిని జూపించెను. ధర్మవీరుడును మిక్కిలిగా సంతోషించి, వారితో మాట్లాడుచు నడచి పోవుచుండెను.

ఆ మీదట వారు యాంత్రికుల మరు భూములను జేరిరి. అచ్చట నెవ్వరైనను పాలుమాలి కూర్చుండిరా, మరి పరుండి గురుపెట్టి నిద్ర బోవలసినదే. ఆ నిద్రతో దీర్ఘ నిద్ర జెందవలసినదే! అప్పుడు పెండ్లి నడకలు నడచుచు, తూలుచు, సోలుచు, మైకముతో కన్నులు మూయుచు, తెరచుచు, ఆవులించుచు, ఒకరిపై నొకరు పడుచు, తొలగుచు, యింతదూరము వచ్చితిమి, బాపురే యింకెంత దూరము బోవలయునో! కొంత సేపయినను విశ్రమింప వలదే! అని నిట్టూర్పులు పుచ్చుచు, నేలపై చతికిల బడ బోవుచు, పక్క తెరగుల నక్కజముగా నడచు తన వారిని గాంచి 'అద్దిరా స్థల మహాత్మ్యమని బృహత్పరాక్రముడు వారిని హెచ్చరించుచు నడిపించు చుండెను. కాని నిద్రవారిని వదల లేదు. అప్పుడత డాలోచించి వారి మైకమును పోగొట్టుటకై యాత్రికులతో నిట్లనెను. ఒక చిన్నకథ చెప్పెదను శ్రద్ధగా వినుడు.

'భక్త నివాసమను గ్రామ మొకటి గలదు. అందొక క్రైస్తవ కుటుంబమున పది సంవత్సరముల ప్రాయముగల నిర్మలయను బాలిక గలదు. ఒకనాడు అప్పుడప్పుడే తెల్లవారు చున్నది. ప్రభాతపు పిల్లగాలులు మెల్లగా వీచు చున్నవి. సూర్య కిరణములు మంచుబొట్లపై బడుటచే నవి ముత్యములట్లు మెరయుచున్నవి. ఆ యుదయము శుభ్ర వస్త్రములు దాల్చి తీర్చిదిద్దిన చిన్ని జడతో, పూగుత్తులతో నిర్మల దేవాలయమునకు వచ్చినది. వచ్చి జగదీశనాథుని జేసునాథు నర్చించి, తదితర అర్చ్యశిష్టులను సేవించి, మహిత ప్రార్థనాలయమున మైమరచి, కాళ్లూని కరములు ముకుళించి

అరమోడ్పు కనుదోయితో శిరము కొంచము వంచి
జపించుచున్నది.

అప్పుడు భూమిపై పుట్టినదాదిగ మెలంగు కావలిదైన
సన్మనస్కుఁడు ఆ బాలికను జేరవచ్చెను. ఆ సన్మనస్కుని యెదుట
నిష్కల్మష చిత్తయైన యీ బాల పాపపు లోకమును భరిం
పఁజాలు పరిశుద్ధ స్లీవమాత్రినున్ను, హృదయ పీఠమున గుప్తమై
వెలుంగు దానిని లేఁజేత పైకినెత్తి, "చూడరుగా మిగుల
భారమైనదీ స్లీవమాత్రిను దీనిని నే మోయఁజాలను; వేరొక
దానిని పరిమాణమున చాల చిన్నదానిని నా కీయరుగా!"
అనుచు ముద్దు మాటలతో నడిగెను. సన్మనస్కుఁడును
ప్రసన్న వదనముతో ఆ స్లీవను తీసికొని అనేక తీర్థు స్లీవ
లున్న గదిలో పదిలపరచి, నిర్మలా! రేపు ఉదయము నీకోరిన
స్లీవ నిచ్చెదను. ఉదయమే రమ్మని బుజ్జగించి పంపివేసెను.

నిర్మల మరునాఁడు ప్రభాతముననే పూజకు వచ్చినది'
పూర్వపు రీతిని జపించుచుండఁగనే సన్మనస్కుఁడును వచ్చెను'
ఆ బాలికను పరిశుద్ధ స్లీవలున్న గదిలోనికి తీసికొనిపోయి,
వాని నన్నింటిని చేయెత్తి చూపి, వీనిలో నీకు నచ్చిన దానిని
వెదకికొమ్మనెను. ఆ బాలికయు కొండంత సంబరముతో
యీ మూలనుండి ఆ మూలకు వెదుకుచు బోయినది.
మరల ఆ మూలనుండి యీ మూలకు వెదుకుచు వచ్చినది.
బాల్య చాపల్య ముట్టిపడునట్లు యిదిగా దది, అదిగా దిది
యనుచు, చూచినదానినే జూచుచు, కొంతసేపు సవరించినది.
అంతట సమీపములోనున్న యొక స్లీవనుగాంచి ఒక్క
గంతువైచి దానిని తీసికొని, ఇది చాల చక్కని స్లీవ గదా!
నాకిదియె గావలయు ననుచు ఆనందముతో కన్నుఁ ద్రిప్పుచు

సన్మనస్కుని యొద్దకు వచ్చినది. అప్పుడా సన్మనస్కుడు చిరునవ్వు నవ్వి, ఊరులు దువ్వి, బిడ్డా! పూర్వము నేను నీ కిచ్చిన స్లీవ యిదే గదా! అనెను. బింకాలికయైన యీ బాలిక సిగ్గున దిగ్గున శిరము వంచెను. కావున నో యాత్రికులారా! ఒక్క విషయమును వినుడు. సర్వ మానవులను పరికించి వారి వారి తారతమ్యము నూహించియే సర్వేశ్వరుడు కష్ట పరంపరలు పంపుచుండును. అట్టి సమయములలో మాకింతటి కష్టములా; యింతటి మహాద్భారములా అని మొరపడక, మంచి మనస్సుతో సహించి యుండవలయును.

ఇట్లు చెప్పుచు బృహత్పరాక్రముడు ఎట్టకేలకు వారిని గట్టునకు లాగుకొని వచ్చెను. అప్పుడా గట్టుపై మహా సాహసుడు, మహా మూర్ఖుడు ననువా రిరువురు నిద్ర పోవుచుండిరి. వారిని తట్టి యాత్రికులు లేపబోయిరి గాని, వారు కనులైనను దెరువలేదు. వారిలో నొకడు 'చెలికాడ! యీ చీమ నన్నెంతగా బాధించుచున్నదో చూచితివా!' అనెను. వేరొకడు భయపడకుము. నా ఖడ్గముతో దాని నిప్పుడే ఖండ ఖండములుగా ఖండించెద ననెను. మొదటి వాడు నీ వెంతటి మూర్ఖుడవురా! అది నీ చేతిలోని ఖడ్గమును లాగుకొని నిన్నును, ఆమీద నన్నును సంహరించినచో మనకు దిక్కేది? ఆమీద మనమెవ్వరితో చెప్పుకొందము? అనెను. రెండవవాడు అంత భయమెందులకురా! ఆ చీమతోనే చెప్పుకొందము' అనెను. వారి ఈ అసందర్భపు మాటలకు చిన్నపిల్లలు నవ్వుకొనిరి. అప్పుడు యాత్రికుల రక్షకుడు చూచితివిగదా! యీ స్థాన ప్రభావము. ఇచ్చట నిద్రించిన వారందరి గతియు నింతియే, అనెను. అప్పుడా యాత్రి

కులు తమకా యుపద్రవము తప్పినందులకు చచ్చిబ్రతికి నంతగా సంతోషించిరి.

అంత మరికొంత దూరముపోయి, ముందట నొక్కనిని పరమండలమువైపు మొగమునెత్తి, చేతులు జోడించి, వినయముతో ప్రార్థించువానిని గాంచిరి. వాడును వీరినిగాంచినదే తడవుగ మహాపరాధివలె పరుగెత్తి పోవదొడగెను. అప్పుడు బృహత్పరాక్రముడు ఎలుగెత్తి 'ఓహో తెరువరీ! మేమును వచ్చుచుంటిమి గదా! పరుగెత్తి పోయెద వేల? కలసిపోవ గూడదా? నిలు నిలువు మ'నెను. అప్పుడు సత్యకాముడు వాని వాలకమును గమనించి, వీనిని నేనెరుగుదును. శీఘ్రగామి యనువాడు అనెను. అంత వారును శీఘ్రముగ నడచి శీఘ్రగామిని గలసికొనిరి. అతనితో నీ వల్లేల మోకాళ్లూని యుంటి వని ప్రశ్నింప, శీఘ్రగామిని యిట్లనియెను. 'నన్ను మాంత్రికుల మరుభూమినుండి వచ్చువానిని ఒక్క కామినీ పిశాచము మోహనాంగి యనునది మోహమును గొల్పుచు వెంబడించినది. అది తాను భాగ్యవతిననియు, సౌంధర్యవతిననియు, గుణవతిననియు తన్ను తానే స్తుతించుకొనుచు, నన్ను పరిణయమాడుమని పీడించినది. నేనెంత ప్రయత్నించినను అది నన్ను వదలకునికి, విసిగి వేసారి, భయపడి, భగవదనుగ్రహమునగాసి నాకు శరణ్యము లేదని మొరకరించి, జపించుచుంటిని. అంతలో మీరును వచ్చితిరి. కన్నులు విప్పునప్పటికి మోహనాంగి యెదుట లేదు. ఏమైనదో నేనెరుగను. అతని వాక్యములను యాత్రికు లాశ్చర్యపడిరి. అంతట వారు మరికొంత దూరము నడచి సుభిక్షమను జనపదమును జేరిరి. ఆ భాగమున చక్కని వెలుంగుతో

చల్లని ఎండలు కాయుచుండెను. చల్లగా మెల్లగా పిల్ల గాలులు అల్లనల్లన వీచుచుండెను. చెరువులు కుంటలు తేటనీటితో తేలి మంచివారి మనసులవలె నిబ్బరమై యుండెను. భూములు సస్యశ్యామలమై సర్వ ప్రాణికోటికి శుభకరమై యుండెను అట్టి యా రమణీయ భూభాగమున మన యాత్రికులు కొంత కాలము పాటు విశ్రమించి అలసటను బాపుకొనిరి. అచ్చటికి దూరమునుండి దివ్యమైన సంగీతము వినవచ్చుచుండెను. దూర ప్రాంతమున మెరపులవలె మెరయుచు ఉషశ్కాలము దృష్టి పథమున నిలుచుచు తేజోమూర్తులు కొందరు కనుపించిరి. అదియే స్వర్గ సామ్రాజ్యమని బృహత్ప్రాకృముడు వారికి చెప్పెను. అంతలో నొక కళ్యాణి శ్రీముఖము నొకదానిని గొనివచ్చి యాత్రికురాలి కిచ్చెను. స్వర్గ సామ్రాజ్యాధిపతియగు సర్వేశ్వరున యొద్దనుండి వచ్చిన యా (శ్రీ) ముఖములోని సుద్దులేవనగా "సౌజన్యవతీ! నీకు మంగళ మగుగాక! అమర స్వరూపిణివై శీఘ్రమే మాయొద్దకు రాగలదానవు." అని యున్నవి.

అంతట యాత్రికురాలు తన ప్రయాణమునకు కాలమగుటయు, బృహత్ప్రాకృమునితో ఆ స్వర్గసామ్రాజ్యమున కెల్లు పోవలసినదియు, అచ్చటి విషయములను వివరముగా నడిగి తెలిసికొనెను. తనతో వచ్చిన యాత్రికులందరిని బిల్చి, కడసారిగా మాట్లాడి తగిన రీతిగా వీడ్కొనెను. తన బిడ్డలను బిల్చి బుద్ధులనుగరపి "నాయనలారా! బుద్ధిమంతులరై యుండి భగవంతుడు మిమ్ము పిలుచువరకు వేచియుండుడు. ఆ దయామయుడు కష్టసుఖములందు సదా మిమ్ము భరించుచుండుగాక. ఇవిగో నా యాశీస్సులు",

ఆనుచు వారిని దీవించెను. అంత తనతో వచ్చిన దయావతిని పిల్చి, బిడ్డా! మన నాథుడైన జేసునాథునితో నీ విషయము విన్నవింతును. సాధుమతివై నిరీక్షించు చుండుము. స్వర్గ సామ్రాజ్యమునకు నీ వనతి కాలములోనే రాగలవనుచు వీడ్కొనెను.

అట్లు యాత్రికురాలు అందరిని వీడ్కొని, మరునాడు స్వర్గ సామ్రాజ్యపు సింహ ద్వారమును జేరి తలుపుతట్టెను. అప్పుడు చంద్రికవంటి కాంతితో, ఆహ్లాదవంతములైన ముఖములతో దివ్యమైన సంగీతముతో కనులకు మిరుమిట్లు గొల్పు భాస్వన్మూర్తులు గొందరెదురు వచ్చి, యాత్రికురాలికి స్వాగతమిచ్చి లోనికిగొంపోయిరి. అంతట పూర్వము నాచే జూడబడినవాడు, మీచే జదువబడిన వాడును, యాత్రికుడునైన క్రైస్తవుడు ఎదురుగా వచ్చి చిరునవ్వుతో క్రైస్తవురాలి దక్షిణ హస్తమును గ్రహించి, మెల్లగా ముందునకు నడపించుకొని పోయెను. అంతట వారు నాకు గనుపింపలేదు.

ఆ పిమ్మట నీ యాత్రికులేమి చేయుచుండిరో యని వీరివంక దృష్టి ప్రసారించితిని. అప్పుడు మరియొక కల్యాణి వారిని వెదుకుచు వచ్చి, దయావతి యెందున్నదనెను. అప్పుడాయమ ముందునకు వచ్చి, నేనే దయావతి ననెను ఆ వచ్చిన పరమకల్యాణి దయావతిని కుడిచేయి పట్టుకొని బిడ్డా! మన ప్రభువు నిన్ను తీసికొని రమ్మని నన్నంపిరి. రమ్ము పోవుదమనెను. దయావతియు యాత్రికులను కలయజూచి, చిరునవ్వు నవ్వి కల్యాణి ననుసరించి పోయెను. వారు సింహద్వారము దాటిన తర్వాత నాకగుపింపలేదు.

ఆ మీదట నొకనాడు ఒక దేవదూత వచ్చి సత్యకాముడు, ధర్మవీరుడు, మొదలుగా గల యాత్రికుల నందరిని పిలచి, మా నాధుడు స్వర్గ సామ్రాజ్యమునకు మిమ్ములను బిలువ బంపెను అని చెప్పె. వారందరును సిద్ధమై దైవమును స్తుతించుచు నడచిపోయి ఆ మహదానంద సామ్రాజ్యములో నడుగిడిరి.

అంతట బృహత్పరాక్రముడు తన పని తీరిపోయి నందుకు సంతసించుచు వెనుకకు నడచి పోవుచుండెను. అతడు తిరిగి తన యజమానుని యొద్దకు బోవుచున్నాడు గావలయు ననుకొంటిని.

మరి యాత్రికుని పుత్రులేమయ్యెరని మీరు కుతూహలపడుచున్నారుగాబోలు! వారింకను చిన్నవారలే గదా! ప్రపంచ సౌఖ్యముల ననుభవించి యెరుంగరు గదా! అందుకే వారినా మహా స్వామి అప్పుడే పిలువలేదు. వారును పెరిగి పెద్దవారై ఆ సుభిక్షమను జనపదముననే నివసించెదరు. యోగ్యురాండ్రయిన స్త్రీలను పరిణయమాడి భగవద్భక్తులైన సంతానమునుగాంచి, తిరువళము విస్తృత మొనరింతురు. భగవంతుని పిలుపైనపుడు కన్నులుమూసి నిత్యానందస్వర్గ సామ్రాజ్యమున తమ జననీ జనకులతో కలకాలమును సుఖించెదరు. అదివారి విషయము.

అంతట వీరు బయలుదేరి వచ్చిన ఆ వినాశక పట్టణ మేమైనదోయని ఆ నగరమువైపు జూచితిని. కొంత సేపటివరకును ఆ పట్టణము దృగ్గోచరము గాకుండుటచే శ్రద్ధగా పరీక్షించి చూచితిని. ఇంకేమున్నది! ఆ మహా

నగర మెప్పుడో అగ్ని కాహుతియై పోయినది. కరుడు గట్టిన, బూడిద మాత్రము పావురపు వన్నెతో పేరుకొని దిబ్బవలె గాన్పించుచున్నది. అందు నివసించు చుండిన మనుష్య మృగ పక్ష్యాది జీవరాశులన్నియు నా యగ్నిలో బడి దగ్ధమై పోయియుండును. అట్లుదగ్ధమై దారుణమైన ఆ మహా నగరమును గాంచిన నా కన్నులవెంట నీరుగార, పరమండలము లోని పితనుద్దేశించి "మహాస్వామీ మీ కరుణా విశేషమున అఖిలక్రైస్తవ మహా ప్రపంచమునకును భద్రమగుగాక!" అని ప్రార్థించితిని. మరియెటు చూడజాలక కన్నులు తెరచితిని.

## ఇది నా స్వప్న వృత్తాంతము

సర్వము సమాప్తము



సెంట్ మైకల్సు ఇండస్ట్రియల్ స్కూల్ ప్రెస్ గుంటూరు-2